రవికుజబుధశుక్రశనులు కలసియుండిరేని వ్యాధులచేతను శత్రువులచేతను పీడింపఁబడువాఁడు, స్థానభ్రష్టు, దుఃఖముచే తపించువాఁడు, క్రోధగలవాఁడై తిరుగుచుండును.

ప్రేష్యో మూర్ఖః క్లీబో మలినాచారోఽతిదుర్భగో వికలః,
భవతి నరో ధనరహిత శ్శశికుజగురుశుక్రరవితనయైః. 15

చంద్రకుజగురుశుక్రశనులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు బంటుతనము సేయువాఁడు, మూర్ఖుఁడు, నపుంసకుఁడు, ధనహీనుఁడు అగును.

జలయంత్రధాతుపారదరసాయనే ష్వతిపటుఃపుమా న్భవతి,
ఏభిః ప్రసిద్ధకర్తా క్షితిసుతరవిజీవసితసౌరైః. 16

రవికుజగురుశుక్రశనులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు రసాయనవస్తువులు మొదలుగాఁగలవానియందు మిక్కిలి సమర్థుఁడగును.

బహుశాస్త్రజ్ఞానపటు ర్మిత్రహిత స్సంమతో గురూణాంచ,
ధర్మపరః కారుణిక స్సూర్యాసితశుక్రబుధజీవైః. 17

రవిబుధగురుశుక్రశనులు కలసియుండిరేని శాస్త్రముల నెఱింగినవాఁడు, ధర్మపరుఁడు, దయగలవాఁడు అగును.

సాధుః కల్యశరీరో విద్యాధనసత్యసౌఖ్యసంపన్నః,
బంధుహితో బహుమిత్రో బుధేందుకుజజీవభృగుపుత్రైః. 18

చంద్రకుజబుధగురుశుక్రులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు సాధువు నిరోగి, విద్య ధనము మొదలైనవి గలవాఁడగును.

తిమిరామయీ దరిద్రః పరాన్న భుఖ్యాచ తే సదాదీనః,
మలినయతి బంధువర్గం కుజార్కిబుధజీవహిమకిరణైః. 19

చంద్రకుజబుధగురుశనులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు గొప్పరోగముగలవాఁడు, దరిద్రుఁడు, అన్నార్థి, బంధువర్గమం దపకీర్తి దెచ్చువాఁడగును.

బహుశత్రుమిత్రపక్షః పరార్థహితకృ ద్విషమశీలః,
ఏకస్థై రతిమానీ బుధేందుకుజశుక్రరవిపుత్రైః. 20

చంద్రకుజబుధశుక్రశనులు కలసియుండిరేని అనేకశత్రుమిత్రులు కలవాఁడు, పరకార్యప్రియుఁడు, విషమస్వభావము గలవాఁడు, మాన్యుఁడు అగును.

నృపమంత్రీనృపతిసమో గణనాథ స్సర్వలోకపూజ్యశ్చ,
ఏకస్థైర్భవతి నర శ్చంద్రేందుజజీవశనిశుక్రైః. 21

చంద్రబుధగురుశుక్రశనులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు రాజమంత్రి, సేనాధిపతి, పూజ్యుఁడు అగును.

సుమనస్కః సోత్సాహో రాజ్ఞా మతివల్లభో విగతశోకః,
నిద్రాతురో దరిద్రః కుజగురుబుధశుక్రరవిపుత్రైః. 22

జననకాలమున కుజబుధగురుశుక్రశనులు కలసియుండఁగాఁ బుట్టినమనుజుఁడు మంచిమనస్సు గలవాఁడు, ఉత్సాహము గలవాఁడు, రాజప్రియుఁడు, శోకహీనుఁడు, నిద్రాస్వభావము గలవాఁడు, దరిద్రుఁడు అగును.

ఇతి అష్టాదశోఽధ్యాయః.

---

## షడ్గ్రహయోగములను దెలుపు పందొమ్మిదవ యధ్యాయము.

విద్యార్థధర్మరతః క్షామో బహుభాషకో విక్రుష్టమతిః,
ఏకభవనోపయాతై ర్బుధేందురవ్యారగురుశుక్రైః. 1

జననకాలమునరవిచంద్రకుజబుధగురుశుక్రులు కలసియుండఁగాఁబుట్టినవాఁడు విద్య ధనము ధర్మము కీర్తి మొదలయినవి గలవాఁడగును.

దాతా పరకార్యకర శ్చలస్వభావో విశుద్ధసత్వశ్చ,
రమతే విజనోద్దేశే రవీందువక్రజ్ఞగురురవిజైః. 2

రవిచంద్రకుజబుధగురుశనులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు దాతయు, పరోపకారి, చంచలస్వభావము మొదలైనవి గలవాఁడగును.

చోరః పరదారరతః కుష్ఠీ స్వజనై ర్నిరాకృతో మూర్ఖః,
స్థానభ్రష్టో విసుతో బుధేందురవ్యారశనిశుక్రైః. 3

రవిచంద్రకుజబుధశుక్రశనులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు చోరుఁడు, పరస్త్రీప్రియుఁడు, కుష్ఠురోగము గలవాఁడు, స్వజనవిరోధి, మూర్ఖుఁడు, స్థానభ్రష్టు, సుతహీనుఁడు అగును.

నీచః పరకర్మరతః క్షయరోగీ శ్వాసకాసపరిభూతః,
నింద్య స్సాస్య ద్బంధూనాం సితేందురవ్యారగురురవిజైః. 4

రవిచంద్రకుజబుధగురుశనులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు నీచుఁడు, పరకార్యరతుఁడు, క్షయవ్యాధి మొదలైనవి గలవాఁడు అగును.

మంత్రీనృపస్య సుభగః క్షాంతియుతో భవతి శోకపరితప్తః,
అకళత్రో ధనరహితో రవీందుబుధజీవసితసౌరైః. 5

రవిచంద్రబుధగురుశుక్రశనులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు రాజప్రియుఁడు, ఓర్మిగలవాఁడు, శోకముచే తపించువాఁడు, కళత్రహీనుఁడు అగును.

తీర్థేషు సదారమతే పుత్రై ర్నిత్యం ధనేనరహితశ్చ,
వనపర్వతోపసేవీ బుధారరవిజీవశశినిశుక్రైః. 6

రవికుజబుధగురుశుక్రశనులు కలసియుండిన యాత్రలు సేయువాఁడు, పుత్రులు ధనము మొదలైనవి గలవాఁడగును.

నిత్యం శుచిః ప్రతాపీ బహుయువతిరతో నృపప్రియో మంత్రీ,
ధనసుతసౌభాగ్యయుతః కుజార్కి సితచంద్రబుధజీవైః. 7

చంద్రకుజబుధగురుశుక్రశనులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు, ఎల్లపుడు శుచిత్వము గలవాఁడు, పరాక్రమము గలవాఁడు, అనేకస్త్రీలయం దాసక్తిగలవాఁడు, రాజప్రియుఁడు, ధనము పుత్రులు మొదలైనవి గలవాఁడగును.

ప్రాయో దరిద్ర దుఃఖీ మూర్ఖః షట్పంచసంయుతై ర్విహగైః,
అన్యోన్యదర్శనాదపి ఫలమేతత్కంధరాః ప్రాహుః. 8

ఆఱుచుగా ఐదుగ్రహములుగాని ఆఱుగ్రహములుగాని కలసియుండినను, పరస్పరము జూచుచుండినను దరిద్రుఁడు, దుఃఖముగలవాఁడు, మూర్ఖుఁడు అగును.

ఇతి ఏకోనవింశోధ్యాయః.

---

## ప్రవ్రజ్యాయోగములను దెలుపు ఇరువదవ యధ్యాయము.

యోగావిభక్తాశ్చతురాదిసంస్థైర్వ్యాసోద్గ్రహైః రపితాపసానాం,
జన్మాదితేషా ముపరై ర్మునీంద్రైస్సం వేదితంతత్కథయామ్యశేషాత్.

కొందఱుమునులచేత నాలుగుమొదలైన గ్రహములచేత తాపసులయొక్క జన్మమొదలుగాఁగల యోగములు చెప్పఁబడెను. వానిని విస్తరించి చెప్పఁబోవుచున్నాను.

సూర్యేందుశుక్రార్యమహీసుతేషు
సూర్యేందుసోమాత్మజభూమిజేషు,
ఏకస్థితేషు ప్రభవే త్తపస్వీ
భాన్వారమందజ్ఞసితేషుచైవ. 2

జన్మకాలమున ఏరాశియందైనను రవిచంద్రకుజగురుశుక్రులు రవిచంద్రకుజబుధులు రవికుజబుధశుక్రశనులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు సన్యాసి యగును.

కుజేందుసూర్యజ్ఞపురోహితైశ్చ తీక్ష్ణాంశుచంద్రార్కిశశాంకజైశ్చ,
సూర్యేందుభూపుత్రశనైశ్చరైస్స్యా దేకర్క్షగైః ప్రవ్రజితో మనుష్యః.

రవిచంద్రకుజబుధగురువులు రవిచంద్రబుధశనులు రవిచంద్రకుజశనులు కలసియుండిరేని సన్యాసియగును.

ఆదిత్యగుర్వార్కిశశాంకపుత్రా భౌమార్కచంద్రాత్మజసూరయశ్చ,
ఏకర్క్షసంస్థాస్తపసి స్థితానాం కుర్వంతి జన్మప్రసవే గ్రహేంద్రాః. 4

కుజబుధగురుశనులు రవికుజబుధశనులు కలసియుండఁగా సన్యాసియగును.

సితార్కభౌమార్కసుతానుహాబలా
సురేజ్యభూపుత్రకసౌరసూరయః,
కుజేందువాగీశశనైశ్చరా ఇమే
సమంగతావై జనయంతి తాపసమ్. 5

రవికుజశుక్రశనులు రవికుజగురుశనులు చంద్రకుజగురుశనులు కలసియుండిరేని సన్యాసియగును.

కుజార్కిసోమాత్మజదేవవందితైః
కుజార్కిచంద్రాత్మజసూర్యభార్గవైః
రవీందుభౌమాసితదానవప్రియై
ర్భవంతి సూతావ్రతసంయుతానరాః. 6

కుజబుధగురుశనులు రవికుజబుధశుక్రశనులు రవిచంద్రకుజశుక్రశనులు కలసియుండిరేని సన్యాసియగును.

సితారసూర్యాత్మజజీవభాస్కరైః
కుజేందుదేవేజ్యబుధార్కనందనైః,
సితేందుపుత్రార్కిశశాంకభూమిజై
ర్భవేత్తపస్వీ వనపర్వతాశ్రయః. 7

రవికుజగురుశుక్రశనులు రవికుజబుధగురుశనులు చంద్రకుజబుధశుక్రశనులు కలసియుండిరేని సన్యాసియగును.

చంద్రేందుపుత్రారసురేడ్యభాస్కరై
శ్శశాంకసూర్యేందుజశుక్రభూమిజైః,
స్థితైరమీభిస్సహితైర్గ్రహసంభవాః
భవంతి వంధ్యామునయోఽత్రదూషకాః. 8

రవిచంద్రకుజబుధగురువులు రవిచంద్రకుజబుధశుక్రులు కలసియుండఁగాఁ బుట్టినవాఁడు నిష్ఫలతపస్వి యగును.

రవీందుభౌమేందుజజీవభార్గవై
శ్శశాంకభౌమార్కిబుధేడ్యభాస్కరైః,
కుజేందుసూర్యార్కిసితేందుసంభవై
ర్భవే దమీభి స్సహితై ర్నరో వ్రతీ. 9

రవిచంద్రకుజబుధగురుశుక్రులు రవిచంద్రకుజబుధగురుశనులు రవిచంద్రకుజబుధశుక్రశనులు కలసియుండఁగా సన్యాసి యగును.

సితేందుజీవార్కజసూర్యలోహితై
స్సితార్కభౌమార్కిశశాంకసోమజైః
ఏకత్రయాతై ర్గగనేచరై స్సదా
భవంతి జాతా మునయో యశస్వినః. 10

రవిచంద్రకుజగురుశుక్రశనులు రవిచంద్రకుజబుధశుక్రశనులు కలసియుండిరేని మునులగుదురు.

కుజజ్ఞవాగీశసితార్కిభాస్కరై
స్సితార్కిజీవేందుజచంద్రభూమిజైః,
బలప్రధానై స్సహితై ర్వ్రిహంగమై
ర్వ్రజే త్ప్రజాతః పురుష స్తపస్వితామ్. 11

రవికుజబుధగురుశుక్రశనులు చంద్రకుజబుధగురుశుక్రశనులు బలవంతులై కలసియుండిరేని సన్యాసి యగును.

రవీందువాగీశశనైశ్చరైశ్చ శనైశ్చరేంద్వర్కసితై రవశ్యం,
రవీందుపుత్రక్షితిజేంద్రపూజ్యై స్తపస్వినస్స్యుః ఫలమూలభక్షిణః.

రవిచంద్రగురుశనులు రవిచంద్రశుక్రశనులు రవికుజబుధగురువులు కూడియుండఁగా ఫలభక్షకులగు మునులగుదురు.

వక్రార్కసోమాత్మజదానవేడ్యా భౌమేందువాగీశశశాంకపుత్రాః,
ఏకర్షగా జన్మని యస్య జంతో ర్భవే ద్వ్రతీ వల్కలచీరధారీ. 13

రవికుజబుధశుక్రులు చంద్రకుజబుధగురువులు కలసియుండఁగా నారచీరలను ధరించిన సన్యాసి యగును.

శశీందుపుత్రక్షితిజార్కపుత్రా బుధక్షమాపుత్రసురేడ్యసౌరాః,
ఏకర్షగా జన్మని యస్య సూతౌ కుర్వంతి తం తాపసమేవ శాంతం.

జన్మకాలమున చంద్రకుజబుధశనులు కుజబుధగురుశనులు కలసియుండిరేని సన్యాసి, శాంతుఁ డగును.

చంద్రార్కభార్గవశశాంకసుతా బలస్థా
భౌమేందుపుత్రసితభాస్కరనందనాశ్చ
మందేందువాక్పతిసితాని యుతం యతీనాం
కుర్వంతి జన్మ ఫలపాకకృతాశనానాం. 15

రవిచంద్రబుధశుక్రులు కుజబుధశుక్రశనులు చంద్రగురుశుక్రశనులు కలసియుండిన ఫలభక్షకులగు యతులగుదురు.

రవికుజశశిశుక్రై శ్చంద్రభౌమజ్ఞసూర్యై
ర్గురుసితరవిమందై శ్శుక్రజీవేందువక్రైః,
కుజబుధసితచంద్రై రేభిరేకర్క్ష యాతై
ర్భవతి గిరివనౌకా స్తాపస స్సర్వవంద్యః. 16

జన్మకాలమున ఆయా గ్రహములు కలసియుండెనేని వనగిరినివాసముగల తాపస శ్రేష్ఠుఁ డగును.

సితశశికుజగురుమందై శ్చంద్రేందుజభౌమదేవగురుశుక్రైః,
రవిశశికుజబుధజీవై ర్భవతి యతి ర్దుఃఖితో దీనః. 17

చంద్రకుజగురుశుక్రశనులు చంద్రకుజబుధగురుశుక్రులు రవిచంద్రకుజబుధ గురువులు కలసియుండిన యతి దుఃఖవంతుఁడగును.

కుజార్కదేవేడ్యసితేందుపుత్రై శ్శనీనసోమాత్మజచంద్రభౌమైః,
సమంగతై స్స్యు స్సబలై ర్యథోక్తై ర్జటాధరావల్కలధారిణశ్చ.

ఆయా గ్రహములు కలసియుండిరేని జడలు నారచీరలు ధరించినయతి యగును

భాన్విందుజేందుకుజజీవసురారిపూజ్యై
స్సూర్యేందుభౌమగురుశుక్రశనైశ్చరైశ్చ,
ప్రాప్నో త్యవశ్య మిహ తాపసరూపమేభి
రేకర్క్షగై ర్గగనవాసిభిరేవ జాతః. 19

ఆయా గ్రహములు కలసియుండిరేని యతియగును.

ప్రవ్రజ్యేశే దినకరగతే భుక్తిమంతో౽తిశక్తాః
ప్రవ్రజ్యాయా స్సుబలసహితై స్థైర్య మాహు ర్గ్రహేంద్రైః,

సంపూర్ణానాం వశమనుగతైః ప్రచ్యుతై స్తై ర్బహుత్వే
వీర్యోపేతై ర్భవతి బహుభి స్సక్ఫలస్సాన్యనుపూర్వ్యామ్. 20

ప్రవ్రజ్యాయోగకర్తయగు గ్రహ మస్తంగతుఁ డయ్యేనేని ఆసన్యాసి భోజన ప్రియుఁడును, బలిష్టుఁడును అగును ప్రవ్రజ్యాయోగకర్తలగు గ్రహములు బలవంతు లగుదురేని సన్యాసము స్థిరమగును. ప్రవ్రజ్యాయోగకర్తలగు గ్రహములు బలహీనులయ్యేనేని సన్యాసము భంగముకలది యగును.

ప్రవ్రజ్యాయా స్స్వామీ రవిముషితతను ర్నిరీక్షితో వాఽన్యైః,
యాచితదీక్షా భవతిచ యవనాధిపతే ర్యథావాక్యమ్. 21

ప్రవ్రజ్యాయోగాధిపతి అస్తంగతుఁడైనను అన్యులచే జూడఁబడినను సన్యసింపవలెనను కోరికగలవాఁ డగును.

శశీ దృగాణే రవిజస్య సంస్థితః కుజార్కదృష్టః ప్రకరోతి తాపసం,
కుజాంశకేవా రవిజేనదృష్టో నవాంశతుల్యం కథయంతి తం పునః.

చంద్రుఁడు రవిదృగాణమందుండి రవికుజులచే జూడఁబడెనేని తాపసి యగును. చంద్రుఁడు కుజనవాంశమందుండి శనిచే జూడఁబడెనేని నవాంశాధిపతి తుల్య సన్యాసి యగును.

జన్మాధిప స్సూర్యసుతేనదృష్ట శ్శేషై రదృష్టిః పురుషస్య సూతౌ,
ఆత్మీయదీక్షాంకురు తేహ్యవశ్యంపూర్వోక్తమత్రాపి విచారణీయమ్.

జన్మాధిపతి యనఁగా జన్మకాలమున చంద్రస్థితరాశ్యధిపతి శనిచే జూడఁబడి ఇతరులచే జూడఁబడకయుండఁగాఁ బుట్టినవాఁడు సన్యాసి యగును.

జన్మపతి ర్వికలాంగః పశ్యతి సౌరిం చతుష్టయే ప్రబలం,
యస్య సభాగ్యవిహీనః ప్రవ్రజ్యాం ప్రాప్నుయా త్పురుషః. 24

జన్మాధిపతి దుర్బలుఁడై కేంద్రములయందున్న శనిని జూచెనేని జాతకుఁడు దరిద్రుఁడైనసన్యాసి యగును.

గురుహిమగురవీణా మేకఏవోదయస్థో
గగనతలగతోవా రిఃఫగ శ్చాల్పమూర్తిః,
అవికలబలభాజా సూర్యపుత్రేణ దృష్టో
జనయతి ఖలు జాతం తాపసం దుఃఖభాజమ్. 25

రవిచంద్రగురువులలో నొకఁడు ఉదయించినవాఁడై దశమమందున్నను లేక బాలుఁడై ద్వాదశమందుండి బలముగల శనిచే జూడఁబడెనేని యతి దుఃఖవంతుఁ డగును.

కుముదవననుబంధుం సౌమ్యభాగే బలస్థం
వియతి గమనశీలాః స్వోచ్ఛభస్థాంశ్చ శేషాః,
యది దినకరపుత్రః పశ్యతి ప్రాప్తవీర్యో
భవతి భువననాథో దీక్షిత శ్చ స్వతంత్రః. 26

శుభగ్రహనవాంశయందున్న చంద్రుని అచ్చయందున్న తక్కినగ్రహములను శని బలయుక్తుఁడై జూచెనేని పుట్టినవాఁడు రాజాధిరాజై సన్యసించును.

అతిశయబలయుక్త శ్శీతగు శ్శుక్లపక్షే
బలవిగహితరిక్తం ప్రేక్షతే లగ్ననాథం,
యది భవతి తపస్వీ దుఃఖిత శ్శోకతప్తో
ధనజనపరిహీనః కృచ్ఛ్రలబ్ధాన్నపానః. 27

బలవంతుఁడైన శుక్లపక్షచంద్రుఁడు బలహీనుఁడైన లగ్నాధిపతిని జూడఁగాఁ బుట్టినవాఁడు దుఃఖము దరిద్రముగల యతి యగును.

సౌరి శ్శుభభాగస్థః పశ్యతి చంద్రం గ్రహాం స్తథైవాన్యాన్,
కుంభాంశేషు ప్రాప్తా న్జనయతి దీక్షాన్వితం పురుషమ్. 28

శని శుభనవాంశయందుండి కుంభాంశయందున్న చంద్రాదిగ్రహములను జూడఁగాఁ బుట్టినవాఁడు యతి యగును.

ఏకర్క్షగతై స్సర్వై ర్జన్మాధిపతి ర్నిరీక్షితో యస్య,
దీక్షాతస్యావశ్యం భవతీతి పురాతనైః కథితమ్. 29

జన్మకాలికచంద్రస్థలగ్నాధిపతి ఒకరాశిని పొందిన సర్వగ్రహములచేతను జూచునపుడు బుట్టినవాఁడు సన్యాసి యగును.

అగ్నీనాం పరిచారకా గిరినదీ తీరాశ్రమే తాపసా
స్సూర్యారాధనతత్పరా గణపతే ర్భక్తా ఉమాయాశ్చయే,
గాయత్రీం జపతాం వనే నియమినాం గంగాభిషేకార్థినాం
కౌమారవ్రత మిచ్ఛతా మధపతి స్తేషాం సదా భాస్కరః. 30

తాపసులయొక్క భేదమును అధిపతులను జెప్పుచున్నాఁడు. అగ్న్యారాధన మొదలుగాఁగల ఉపాసనగల తాపసులకు రవి అధిపతి.

వృద్ధశ్రావకభస్మధూళితవలా శ్శైవవ్రతే యే స్థితాః
బాహ్యాః పాతకితాంగతాః భగవతీ భక్తాశ్చ నిస్సంగినః,
సిద్ధాంతే ఖలు సోమనామ్ని నిరతా కాపాలికానిష్ఠురా
స్తేషాం నాయకతాంగత శ్శశధరః ఖట్వాంగపాణిద్యుతిః 31

వృద్ధశ్రావకాదిభేదములుగల తాపసులకు చంద్రుఁ డధిపతి యగును.

ఉపాసకాబుద్ధసమాశ్రయంగతాఃశిఖాంగతాఃపాండరభిక్షవశ్చయే,
సువాససోరక్తపటాజితేంద్రియాః ప్రభుస్సదైషాంక్షితిజః ప్రకీర్తితః.

బౌద్ధమతాదులను పొందిన తాపసులకు కుజుఁ డధిపతి యగును.

అజీవినాం కుహకినాం సమయాధికాయే
యే దీక్షితా స్తనుభృతః ఖలు గారడేచ,
తంత్రే మయూరపిశితాశనయోశ్చ యుక్తా
స్తేషాం శశాంకతనయోఽధిపతి ర్నిరుక్తః. 33

ఏకదండసన్యాసాదులకు బుధుఁ డధిపతి యగును.

ఏకం త్రి నథవా వహంతి మునయో దండాన్ కషాయాంబరా
వానప్రస్థ ముపాగతాః ఫలపయో భక్షాశ్చ యే భిక్షవః,
గార్హస్థే నతు సంస్థితా నియమిన స్సద్బ్రహ్మచర్యంగతా
స్తేషాం దండపతి స్సురేంద్రసచివ స్తీర్థేషు యే స్నాతకాః. 34

త్రిదండసన్యాసము మొదలగు ఆశ్రమములు గలవారికి బృహస్పతి అధిపతి యగును.

పాశుపతయజ్ఞదీక్షావ్రతేషు యే నిత్యమేన సంయుక్తాః,
వైష్ణవచరకాణా మపి తేషాం నేతా ప్రకీర్తిత శ్శుక్రః. 35

పాశుపతాదిదీక్షలుగల యతులకు శుక్రుఁ డధిపతి యగును.

పాషండవ్రతనిరతా దిగంబరా భిక్షవోయేచ,
తేషా మధిపతి రార్కి శ్శ్రావకతరుమూలినశ్చ దుస్తపసః. 36

పాషండాదివ్రతనిరతులైన యతులకు శని అధిపతి యగును.

ప్రకథితమునియోగే రాజయోగో యదిస్యా
దశుభఫలవిపాకం సర్వ మున్మూల్య పశ్చాత్,
జనయతి పృథివీశం దీక్షితం సాధుశీలం
ప్రణత నృపశిరోమణ్యుజ్వలత్పాదయుగ్మమ్. 37

ప్రవ్రజ్యాయోగంబును రాజయోగంబును గూడియుండఁగాఁ బుట్టినవాఁడు ప్రవ్రజ్యాయోగమందు జెప్పఁబడిన అశుభమంతయు నశించి సమస్తదేశాధీశులయొక్క శిరోరత్నములచే ప్రకాశించు పాదయుగ్మము గలవాఁ డగును. ఈయోగములు బలాబలము ననుసరించి ఆలోచించవలెను.

ఇతి వింశోధ్యాయః.

## నాభసయోగములను దెలుపు ఇరువదొకటవ యధ్యాయము.

యవనాద్యైర్వి స్తరతః కథితా యోగాస్తు నాభసానామ్నా,
అష్టాదశశతగుణితా స్తేషాం ద్వాత్రింశదిహవక్ష్యే

యవనాదులు ౧౮౦౦ నాభసయోగములను జెప్పిరి. ఆయోగములలో ముప్పది రెండుమాత్రము జెప్పఁబోవుచున్నాను.

నౌచ్ఛత్రకూటకార్ముకశృంగాటకవజ్రదామనీపాశాః,
వీణాసరోజముసలా వాపీహలశరసముద్రచక్రాణి. 2

మాలాసర్పార్ధేందూ యవకేదారౌ గదావిహగయూపాః,
యుగశకటశూలదండా రజ్జుశ్శక్తి స్తథానలోగోలః. 3

నౌకాయోగము మొదలు ౩౨ యోగముల నామములు జెప్పఁబడినవి.

సచరాచరస్య జగతో యోగైరేభిః ప్రకీర్త్యతే ప్రసవః,
ఆశ్రయజాతా న్ప్రాహు ర్మాణింధాః ముసలరజ్జునలయోగాన్. 4

జగత్తుయం దుత్పన్నమైన సమస్తజంతుజాలమునకు ఈయోగములలో నొకయోగము తప్పక కలుగును. ముసలరజ్జునలయోగములు ఆశ్రయయోగములని మాణింధాదులు జెప్పిరి.

గోళయుగశూలపాశా వీణాకేదారదామనీసంజ్ఞాః,
సప్తైతే సంఖ్యాఖ్యాః పూర్వాచార్యై స్సముద్దిష్టాః. 5

ఈ గోళాదయోగములు ౭. వీనికి సంఖ్యాయోగములని పేరు.

ద్వేచార్థయోగసంజ్ఞే భుజంగమాలే పరాశరేణోక్తే,
ఆకృతిజాతా వింశతి రపరైః కథితాశ్చ సావిత్రే. 6

భుజంగమాలాయోగములు రెండును దళయోగములు. ఆకృతియోగములు ౨౦ అని కొందఱు చెప్పిరి.

ఆశ్రయయోగే జాతా అమిశ్రితే సౌఖ్యలాభగుణయుక్తాః,
అన్యోన్యమిశ్రితాశ్చే ద్విగతఫలా స్స్యు స్తదాయోగాః. 7

ఆశ్రయయోగములు సంకరములు లేకయుండఁగా ఆయోగములయందు బుట్టినవాఁడు సౌఖ్యము లాభము గలవాఁడగును. మిశ్రమముగా నుండెనేని ఫలశూన్యముగ నుండును.

నందంతి సైవర్భాగ్యై ర్లబ్ధసలబ్ధధనా నృపప్రియాః ఖ్యాతాః,
ప్రాయేణ సౌఖ్యయుక్తా శ్చాకృతియోగేషు యే జాతాః. 8

ఆశ్రయయోగములందు బుట్టువారు తమభాగ్యముచే సంతసించువారును పరల బ్ధధనము మొదలయినవి గలవా రగుదురు.

పరభాగ్యలబ్ధసౌఖ్యా ధనభాగ్యై రేవ జీవితా స్తేషాం,
సంఖ్యాయోగే జాతా యేపురుషా స్సర్వతో వికలాః. 9

సంఖ్యాయోగమందు బుట్టినవాఁడు పరధనమును పొంది సౌఖ్యమును పొందు వాఁడగును.

క్వచి త్స్వభాగ్యైః క్వచిదేవ మేవం క్వచిత్పరాద్యూ్యపతితఃఫలంచ,
క్వచి త్సుఖం దుఃఖమతీవ కష్టం సమార్థయోగే పురుషే లభేత. 10

దళయోగమందు బుట్టినవాఁడు సుఖదుఃఖములు సమముగ గలవాఁడగును.

హోరాదికంటకేభ్య స్సప్తర్ష గతైః క్రమేణ యోగా స్స్యుః,
నౌచ్ఛత్రకూటకార్ముకనిర్దేశాః పూర్వయవనేంద్రైః. 11

లగ్నకేంద్రము మొదలు ఏడురాసులయందును గ్రహము లవిచ్ఛిన్నంబులై యుండెనేని నౌకాయోగమనియు, చతుర్థకేంద్రము మొద లవిచ్ఛిన్నంబులై యుండెనేని ఛత్రయోగమనియు, సప్తమకేంద్రము మొద లవిచ్ఛిన్నంబులై యుండెనేని కూటయోగమనియు, దశమకేంద్రము మొదలు లవిచ్ఛిన్నంబులై యుండెనేని కార్ముక యోగమనియు దెలియవలయును.

లగ్నాదికంటకేభ్య శ్చతుర్గ్రహావస్థితై ర్గ్రహై ర్యోగాః,
యూపశరశక్తిదండా స్సత్యాచార్యప్రియానిత్యమ్. 12

లగ్నకేంద్రము మొదలు నాలుగురాసులయందు రవ్యాదిగ్రహంబు లవిచ్ఛిన్నం బులై యుండెనేని యూపయోగమనియు, ఇట్లే చతుర్థకేంద్రము మొదలు యుండె నేని శరయోగమనియు, సప్తమకేంద్రము మొదలు యుండెనేని శక్తియోగమనియు, దశమకేంద్రము మొదలు యుండెనేని దండయోగమనియు నెఱుంగునది.

సప్తర్షగై ర్గ్రహైంద్రైః కేంద్రా దన్యత్ర కీర్తితోర్ధశశీ,
కేంద్రప్రత్యాసన్నై ర్భవనద్వయగై ర్గదానామ. 13

పణపరస్థానము మొదలుగాఁగాని ఆపోక్లిమస్థానము మొదలుగాఁగాని ఏడు రాసులయందు గ్రహము లవిచ్ఛిన్నంబులై యుండెనేని అర్ధచంద్రయోగమనియు, గ్రహములన్నియు సమీపమందున్న రెండుకేంద్రములను పొందెనేని గదాయోగము (అనఁగా: లగ్నచతుర్థకేంద్రములయందును చతుర్థసప్తమకేంద్రములయందును సప్త మదశమకేంద్రములయందును దశమలగ్నకేంద్రములయందును సర్వగ్రహంబులుండుట గదాయోగమని తాత్పర్యము).

లగ్నాస్తమగై స్సౌమ్యైః పాపై స్సుఖకర్మగై ర్భవతి వజ్రం,
విపరీతై ర్యవయోగో మిశ్రైః పద్మం బహిస్థితై ర్వాపీ. 14

లగ్నసప్తమకేంద్రములయందు శుభగ్రహములుండి చతుర్థదశమకేంద్రములయందుమాత్రము పాపగ్రహము లుండెనేని వజ్రయోగమనియు, లగ్నసప్తమకేంద్రములయందు పాపగ్రహములుండి చతుర్థదశమకేంద్రములయందుమాత్రము శుభగ్రహములుండెనేని యవయోగమనియు, నాలుగుకేంద్రములయందును మిశ్రమముగనుండెనేని (అనఁగా: శుభులుండవలసిన లగ్నసప్తమములలో నొకస్థానమందు శుభగ్రహములు నొకస్థానమందు పాపగ్రహములు, అశుభులుండవలసిన చతుర్థదశమములలో నొకస్థానమందు శుభగ్రహములు నొకస్థానమందు పాపగ్రహము లుండెనేని) పద్మకయోగమనియు (కేంద్రాదన్యత్ర గ్రహములు లేకుండవలయుననుట), ఈపద్మకయోగమునకు చెప్పఁబడిన గ్రహస్థితి పణపరరాసులయందుగాని ఆపోక్లిమరాసులయందుగాని యుండెనేని వాపీయోగమనియు నెఱుంగునది. (వజ్రయవయోగములు పూర్వశాస్త్రానుసారము జెప్పఁబడినవి. సూర్యునకు చతుర్థరాశియందు బుధశుక్రులుండరు గాన ఈయోగము లసంభవములని వరాహమిహిరులువారు బృహజ్జాతకమునందు జెప్పిరి).

హోరాస్తగతై శ్శకటం చతుర్థదశమాశ్రితై ర్భవే ద్విహగః,
ఉదయాన్యగై స్త్రికోణై ర్హల ఇతి శృంగాటకం సలగ్నైతత్. 15

సర్వగ్రహములు లగ్నసప్తమములయందుండెనేని శకటయోగమనియు, చతుర్థదశమములయందుండెనేని విహగయోగమనియు, సకలగ్రహంబులు లగ్నత్రికోణముగాక తక్కిన త్రికోణములయందు యథాసంభవములుగా నున్న హలయోగమనియు (అనఁగా: ద్వితీయషష్ఠదశమములు తృతీయసప్తమైకాదశములు చతుర్థాష్టమద్వాదశములు పరస్పరత్రికోణములు), లగ్నపంచమనవమములయందుండెనేని శృంగాటకయోగమనియు దెలియవలయును.

రాశ్యంతరితై ర్లగ్నా త్షడ్భవనగతై ర్భవే చ్చక్రం,
అర్థా త్తదైవ యాతై శ్చక్రాకారో భవే జ్జలధిః. 16

గ్రహములన్నియు లగ్నము మొదలు రాశ్యంతరగతులాయెనేని (అనఁగా: లగ్నతృతీయ పంచమ సప్తమ నవమ ఏకాదశములను పొందెనేని) చక్రయోగమనియు, ద్వితీయమొదలీప్రకారమే (అనఁగా: ద్వితీయ చతుర్థ షష్ఠ అష్టమ దశమ ద్వాదశములను) పొందియుండెనేని సముద్రయోగమనియు దెలియఁదగినది.

ఇత్యాకృతిజా ఏతే వింశతిసంఖ్యా మయా సముద్దిష్టాః,

ఆశ్రయజాతా స్త్వష్ట్యే యథామతం వృద్ధగార్గ్యస్య. 17

ఈప్రకారము ఇరువది ఆకృతియోగములు జెప్పఁబడినవి. ఇఁక నాశ్రయ యోగములను గార్గిమతానుసారము జెప్పుచున్నాను.

ఉభయస్థిరచరసంస్థై స్సర్వై ర్నలముసలరజ్జవః క్రమశః,
కేంద్రేషు సౌమ్యపాపై ర్మాలాసర్పశ్చ దళయోగా. 18

సర్వగ్రహంబులు ద్విస్వభావరాసులయందుండెనేని నలయోగమనియు, స్థిరరాసులయందుండెనేని ముసలయోగమనియు, చరరాసులయందుండెనేని రజ్జుయోగమనియు, మూఁడుకేంద్రములయందు చంద్రవ్యతిరిక్తశుభగ్రహములుండి పాపగ్రహములు లేకుండెనేని దళాఖ్యంబగు మాలాయోగమనియు, మూఁడుకేంద్రములయందు పాపగ్రహములగు రవికుజశనులుండిరేని దళాఖ్యంబగు సర్పయోగమనియు నెఱుంగునది. ఇట్లు మూఁడుకేంద్రములు గ్రహించుటకు చంద్రవ్యతిరిక్తశుభగ్రహములు గ్రహించుటకు గార్గివచనము. శ్లో. “త్రికేంద్రకై ర్యమారార్కైః స్సర్పో దుఃఖితజన్మదః, భోగిజన్మప్రదామాలా తద్వజ్జీవసితేందుజైః.”

ఏకభవనాదిసంస్థై స్సంఖ్యాఖ్యా స్స్యు ర్యథాక్రమం యోగాః,
గోళయుగశూలసంజ్ఞాః కేదారః పాశదామనీవీణాః. 19

సూర్యాదిసప్తగ్రహములు ద్వాదశరాసులలో నెచ్చటనైనను ఒకరాశియందుండెనేని గోళయోగమనియు, రెండురాసులయందుండెనేని యుగయోగమనియు, మూఁడురాసులయందుండెనేని శూలయోగమనియు, నాలుగురాసులయందుండెనేని కేదారయోగమనియు, ఐదురాసులయందుండెనేని పాశయోగమనియు, ఆరురాసులయందుండెనేని దామనీయోగమనియు, ఏడురాసులయందుండెనేని వీణాయోగమనియు దెలియవలయును.

ఏతేషాం ఫలయోగం కథయామి యథాక్రమం మునిభి రుక్తం,
సర్వదశాస్వపి ఫలదా స్సకలాఏతేబుద్ధై శ్చింత్యాః. 20

ఈయోగములు సర్వదశలయందు జరుగునుగాన ఫలములను విస్తరించి చెప్పుచున్నాను.

సలిలోపజీవవిభవా బహ్వాయాఖ్యాతకీర్తితో దృష్టాః,
కృపణా బలినో లుబ్ధా నౌసంభూతాశ్చలాః పురుషాః. 21

నౌకాయోగమందు బుట్టినవాఁడు ఉదకములచే సంపాదింపఁబడిన విభవముగలవాఁడు, గొప్పకీర్తి మొదలైనవి గలవాఁడగును.

అనృతిక కితవబంధనపాలానిష్కించనా శ్చతాః క్రూరః,
కూటసముత్థా నిత్యం భవంతి గిరిదుర్గవాసినో మనుజాః. 22

కూటయోగమందుబుట్టినవాఁడు అబద్ధము జూదము మొదలైన యాటలాడు వాఁడగును.

స్వజనాశ్రయోజయావా న్దాతా నృపవల్లభః ప్రకృష్టమతిః,
ప్రథమేంత్యేవయసి నర స్సుఖభాగ్యయుత స్సితాతపత్రస్యాత్. 23

ఛత్రయోగమందు బుట్టినవాఁడు స్వజనాశ్రయుఁడు దయ మొదలైనవి గల వాఁడగును.

అనృతికగుప్తిపాలా శ్చోరాః కితవాశ్చ కానసే నిరతాః,
కార్ముకయోగే జాతా భాగ్యవిహీనావయోమధ్యే. 24

కార్ముకయోగమందు బుట్టినవాఁడు అనృతాది గుణయుక్తుఁడగును.

సుభగా స్సేనాపతయః కాంతశరీరా నృపప్రియాబలినః,
మణికనకభూషణయుతా భవంతి యోగేర్ధచంద్రాఖ్యే. 25

అర్ధచంద్రయోగమందు బుట్టినవాఁడు సౌందర్యాది గుణయుక్తుఁడగును.

ఆద్యంతవయసి సుఖితా శ్శూరాగా స్సుభగా విరోగదేహాశ్చ,
భాగ్యవిహీనా వజ్రే జాతా స్సద్వజనై ర్విరుద్ధాశ్చ. 26

వజ్రయోగమందు పుట్టినవాఁడు బాల్యమందు వార్ధకమందు సుఖము శౌర్యము మొదలైనవి గలవాఁడగును.

వ్రతనియమమంగళపరాః వయసో మధ్యే సుఖార్థసంయుక్తాః,
దాతారః స్థిరవిత్తా యవయోగభవా స్సదాపురుషాః. 27

యవయోగమందు బుట్టినవాఁడు వ్రతాదులయందు దాసక్తిగలవాఁడగును.

స్ఫీతయశసో గుణాఢ్యా స్సిరాయుషో విపులకీర్తయః కాంతాః,
శుభయశసః పృథివీశాః కమలభవా మానవానిత్యమ్. 28

కమలయోగమందు బుట్టినవాఁడు గొప్పకీర్తి మొదలైనవి గలవాఁడగును.

నిధికరణే నిపుణధియ స్సిరార్థసుఖసంయుతా స్సురూపాశ్చ,
నయనసుఖసంప్రహృష్టా వాపీయోగే. నరా జాతాః. 29

వాపీయోగమందుత్పన్నమైనవాఁడు ధననిక్షేపణాదులయందు సమర్థుఁడగును.

రోగార్తాః కుకళత్రా మూర్ఖా శ్శకటానుజీవినో నిస్స్వాః,
స్వజనై ర్మిత్రై ర్హీనా శ్శకటే జాతా భవంతి నరాః. 30

శకటయోగమందు బుట్టినవాఁడు రోగపీడితుఁడు మూర్ఖాదిగుణయుక్తుఁడగును.

భ్రమణరుచయో నికృష్టా దూతా స్సురతానుజీవినో ధృష్టాః,
కలహప్రియాశ్చ నిత్యం విహగేయోగే సదాజాతాః. 31

విహగయోగమందు బుట్టినవాఁడు తిరుగుటయం దాసక్తి మొదలైనవి గలవాఁడగును.

సతతం మానార్థపరా యజ్వాన శ్శాస్త్రయోగకుశలాశ్చ,
ధనకనకరత్నసంప త్సంయుక్తా మానవా గదాయాంతు. 32

గదాయోగమందు బుట్టినవాఁడు అభిమానాదులయం దాసక్తి మొదలైనవి గలవాఁడగును.

ప్రియకలహాసమరసాహాససుఖినోనృపతేః ప్రియాస్సుభగకాంతాః,
ఆఢ్యాయువతి ద్వేష్యా శ్శృంగాటకసంభవా మనుజాః. 33

శృంగాటకయోగమందు బుట్టినవాఁడు ప్రియము మొదలగుగుణములు గలవాఁడగును.

బహ్వాశినో దరిద్రాః కృషీవలా దుఃఖితాశ్చ సోద్వేగాః,
బంధుసుహృ త్సంత్యక్తాః ప్రేష్యా హలసంజ్ఞితే పురుషాః. 34

హలయోగమందు బుట్టినవాఁడు తిండిపోతు, దరిద్రుఁడు ఈ మొదలగు గుణయుక్తుఁడగును.

ప్రణతా శేషనరాధిపకిరీటరత్నప్రభాస్ఫురితపాదః,
భవతి నరేంద్రో మనుజ శ్చక్రే యో జాయతే యోగే. 35

చక్రయోగమందు బుట్టినవాఁడు రాజాధిరాజు అగును.

బహుధనరత్నాః క్షితిపా యోగార్థయుతా జనప్రియాశ్చాపి,
ఉదధిసముత్థాః పురుషా స్థిరచిత్తా స్సత్వవంతశ్చ. 36

సముద్రయోగమందు బుట్టినవారు గొప్పధనము రత్నములు మొదలైనవి గలవారగుదురు.

ఆత్మనిరతా నిరత స్త్యాగయుతో విత్తసౌఖ్యసంపన్నః,
వ్రతనియమసత్యనిరతో యూపేజాతో విశిష్టశ్చ. 37

యూపయోగమందు బుట్టినవాఁడు ఆత్మరక్షణ త్యాగము మొదలైనవి గలవాఁడగును.

ఇషుకరణ దస్యుబంధన మృగయాదన సేవనేతిసోన్మాదాః,
హింస్రాః కుశిల్పనిరతా శ్శరయోగే సంప్రసూతాస్స్యుః. 38

శరయోగమం దుత్పన్నమైనవాఁడు వేఁటాడుట మొదలయినవానియం దాసక్తి గలవాఁ డగును.

ధనరహిత వికలదుఃఖిత నీచాలసపేలవాయుషః పురుషాః,
సంగ్రామయుద్ధనిపుణా శ్శక్త్యాం జాతా స్థిరా స్సుభగాః. 39

శక్తియోగమందు బుట్టినవాఁడు ధనహీనత మొదలైనవి గలవాఁడగును.

హతపుత్రదారనిస్స్వా స్సర్వజనై ర్న్యక్కృతా స్స్వజనబాహ్యాః,
దుఃఖితనీచాః ప్రేష్యా దండప్రభవా నరాస్సతతమ్. 40

దండయోగమందు బుట్టినవాఁడు హతభార్యాపుత్త్రులు మొదలైనవి గలవాఁ డగును.

నిత్యం సుఖప్రధానా వాహనవస్త్రార్థభోగసంపన్నాః,
కాంతా స్సుబహుస్త్రీకా మాలాయాం సంప్రసూతా స్స్యుః. 41

మాలాయోగమందు బుట్టినవాఁడు సుఖము మొదలైనవి గలవాఁడగును.

విషమాః క్రూరా నిఃస్వా నిత్యం దుఃఖార్దితా స్సుదీనాశ్చ,
పరభుక్తాః పానరతా స్సర్పే జాతా భవంతి నరాః. 42

సర్పయోగమున బుట్టినవాఁడు విషమస్వభావము మొదలైనవి గలవాఁడగును.

అటనప్రియా స్సురూపాః పరదేశే ష్వర్థభాగినో మనుజాః,
క్రూరాః ఖలస్వభావా రజ్జుప్రభవా స్సదా కథితాః. 43

రజ్జుయోగమున బుట్టినవాఁడు తిరుగుటయం దాసక్తి సౌందర్యము మొదలగునవి గలవాఁడగును.

మానధనజ్ఞానయుతాః కర్మోద్యుక్తా నృపప్రియాః ఖ్యాతాః,
స్థిరచిత్తా ముసలోత్థా భవంతి శూరా స్సదా పురుషాః. 44

ముసలయోగమందు బుట్టినవాఁడు అభిమానము ధనము జ్ఞానము మొదలైనవి గలవాఁడగును.

ఊనాతిరిక్తదేహా ధనసంచయభాగినోఽతినిపుణాశ్చ,
బంధుహితాశ్చ సురూపా నలయోగే సంప్రసూయంతే. 45

నలయోగమందు బుట్టినవాఁడు సమానదేహము మొదలైనవి గలవాఁడగును.

దారిద్ర్యాలస్యయుతా విద్యాజ్ఞా మానవర్జితా మలినాః,

త్యం దుఃఖితదీనా గోళేయోగే భవంతి నరాః. 46

గోళయోగమందు బుట్టినవాఁడు దరిద్రము మొదలగు గుణయుక్తుఁడగును.

పాషండభాగినో వా ధనరహితా వా బహిష్కృతా లోకే,
సుతమానధర్మరహితా యుగయోగే మానవాజాతాః. 47

యుగయోగమందు బుట్టినవాఁడు పాషండాది గుణయుక్తుఁడగును.

తీక్ష్ణాలసధనరహితా హింస్రాస్సుబహిష్కృతా మహాశూరాః,
సంగ్రామలబ్ధశబ్దా శ్శూలే రౌద్రాః ప్రజాయంతే. 48

శూలయోగమందు బుట్టినవాఁడు తీక్ష్ణాదిగుణయుక్తుఁడగును.

సుబహూనా ముపయోజ్యాః కృషీవలా స్సత్యవాదిన స్సుఖితాః,
కేదారే సంభూతా శ్చలస్వభావా ధనై ర్యుక్తాః. 49

కేదారయోగమందు బుట్టినవాఁడు పరోపకారాది గుణయుక్తుఁడగును.

పాశేబంధనభాజః కార్యేద్యుక్తాః ప్రపంచకారాశ్చ,
బహుభాషిణో విశీలా బహుభృత్యా స్సంప్రసూతాస్స్యుః. 50

పాశయోగమందు బుట్టినవాఁడు బంధనమును పొందుట మొదలైనగుణములు గలవాఁడగును.

దామిన్యా ముపకారీ పశుగణయుక్తో ధనేశ్వరో మూఢః,
బహుసుతరత్నసమృద్ధో ధీరో విద్వాన్ ప్రజాతస్స్యాత్. 51

దామినీయోగమందు బుట్టినవాఁడు ఉపకారాది గుణయుక్తుఁడగును.

మిత్రాన్వితా స్సువచన శ్శాస్త్రపరాగేయవాద్యనిరతాశ్చ,
సుఖభాజో బహుభృత్యా వీణాయాం కీర్తితా మనుజాః. 52

వీణాయోగమందు బుట్టినవాఁడు మిత్రులు సువాక్కులు మొదలైనవి గలవాఁడగును.

ఇతి ఏకవింశోధ్యాయః.

---

## రవిచారమునుదెలుపు ఇరువదిరెండవ యధ్యాయము.

సర్వస్య సర్వకాలం గ్రహారాశిసముద్భవం ఫలంయస్మాత్,
కథయామ్యతః ప్రయత్నా చ్ఛేషాచార్యా నసమాశ్రిత్య. 1

గర్గాదిమతానుసారముగా సర్వకాలములయందు సర్వమునకు జరుగుగ్రహరాశి సముద్భవమైనఫలమును జెప్పుచున్నాను.

శాస్త్రార్థకృతికలాభిః ఖ్యాతో యుద్ధప్రియః ప్రచండశ్చ,
ఉద్యుక్తో భ్రమణరుచి ర్దృఢాస్థిబంధః క్రియే శ్రేష్ఠః. 2

సూర్యుఁడు జననకాలమున మేషమందుండఁగా బుట్టినవాఁడు శాస్త్రములను జదువువాఁడు, ఖ్యాతిమొదలైనవి గలవాఁడగును.

సాహసకర్మాభిరతః పిత్తాసృగ్వ్యాధికాంతిసత్వయుతః,
సూర్యే భవతి నరేంద్ర స్స్వతుంగరాశౌ నరో జాతః. 3

సూర్యుఁడు ఉచ్చయందుండఁగాఁ బుట్టినవాఁడు సాహసము మొదలైనవి గలవాఁడగును.

దానరతో బహుభృత్యో లలితో యువతిప్రియో మృదుశరీరః,
కుజభవనగతే సూర్యే చంద్రేణ నిరీక్షితే భవతి. 4

సూర్యుఁడు కుజక్షేత్రమందుండి చంద్రునిచే జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు దానమం దాసక్తిగలవాఁడు, అనేకభృత్యులు మొదలైనవి గలవాఁడగును.

సంగ్రామోత్కటవీర్యః క్రూర స్సంరక్తనేత్రకరచరణః,
భౌమగృహే కుజదృష్టే భానౌ తేజో బలోపేతః. 5

సూర్యుఁడు కుజక్షేత్రమందుండి కుజునిచే జూడఁబడెనేని యుద్ధమం దాసక్తి మొదలైనవి గలవాఁడగును. తక్కినరాసులయందుగూడ నిట్లే తెలియఁదగినది.

ప్రేష్యః పరకర్మరతో సుందధన స్సత్వహీనబహుదుఃఖః,
భానౌ బుధ సందృష్టే కుజభవనే మలినకాయశ్చ. 6
భూరిద్రవిణో దాతా నృపమంత్రీదండనాయకో వాఽపి,
తరణౌ సురగురుదృష్టే కుజభవనే జాయతే శ్రేష్ఠః. 7
కుత్సితరామాభర్తా బహుశత్రుః క్షీణబంధవో దీనః,
భౌమగృహేసి తదృష్టే దివాకరే జాయతే కుష్ఠీ. 8
దుఃఖపరిప్లుతదేహః కార్యోన్మాదీ భవే ద్విమూఢమతిః,
భౌమర్క్షే దినకరే రవితనయనిరీక్షితే మూర్ఖః. 9

తా. సులభము.

వచనాక్షిరోగతప్తః క్లేశసహిష్ణు ర్న చాపి బహుశత్రుః,
భక్తో వ్యవహారరతో రతిమా న్వంధ్యాంగనా ద్వేషీ. 10

భోజనమాల్యాచ్ఛాదనగంధయుతో గేయవాద్యనృత్తజ్ఞః,
దినకరే వృషసంస్థే భవతి పుమాన్ సలిలభీరుశ్చ. 11

రవివృషభమందుండఁగాఁబుట్టినవాఁడు ముఖరోగము నేత్రరోగముగలవాఁడు, శత్రువులుగలవాఁడు, సుగంధద్రవ్యాదులయం దాసక్తిమొదలైనవి గలవాఁడగును.

వేశ్యారతి ర్మృదువచాః బహుయువతి సమాశ్రయో భవతి,
దిననాథే సితభవనే దృష్టే శశినా సలిలజీవీ. 12

రవి శుక్రక్షేత్రమందుండి చంద్రునిచే జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు వేశ్యలయం దాసక్తిమొదలైనవి గలవాఁడగును ఇట్లే శుక్రక్షేత్రమందుండి కుజాదిగ్రహములచే జూడఁబడెనేని ఆయాఫలములు జరుగును.

శూర స్సంగ్రామరుచి స్తేజస్వీ సాహసా ప్తధనకీర్తిః,
దిననాథే సితభవనే కుజసందృష్టే పుమా న్వికలః. 13
లిపిలేఖ్యకావ్యపుస్తకగేయాది విధావతీవ నిపుణమతిః,
దిననాథే సితభవనే బుధసందృష్టే భవే త్సుతనుః. 14
బహుశత్రుమిత్రపక్షో నృపసచివ శ్చారులోచనః కాంతః,
దిననాథే సితభవనే గురుణాదృష్టే సుతోషితో నృపతిః. 15
నృపతి ర్నృపమంత్రీ వా స్త్రీధనబహుయోగసంయుతో మతిమాన్,
దిననాథే సితభవనే సితసందృష్టే భవే ద్భీరుః. 16
నీచోలసోదరిద్రో వృద్ధస్త్రీసంగతో విషయశీలః,
దిననాథే సితభవనే శనిదృష్టే వ్యాధిసంతప్తః. 17

రవిశుక్రక్షేత్రమందుండి కుజాదిగ్రహములచే జూడఁబడెనేని ఆయాఫలములు జరుగును.

మేధావీ వాఙ్మధురో వాత్సల్యగుణై ర్యుత శ్శ్రుతాచారః,
విజ్ఞాన శాస్త్రకుశలో బహువిత్త ఉదారచేష్టశ్చ. 18
నిపుణో జ్యోతిషవేత్తా మధ్యమరూపో ద్విమాతృక స్సుభగః,
మిథునస్థే దినభర్తరి జాతః పురుషో వినీతస్స్యాత్. 19

సూర్యుఁడు మిథునమందుండఁగాఁ బుట్టినవాఁడు ధారణసమర్థమైనబుద్ధి వాఙ్మాధుర్యము దయ మొదలైనగుణయుక్తుఁడగును.

రిపుబాంధవకృతపీడా విదేశగమనార్దితో బహువిలాపీ,
బుధభవనే దినభర్తరి దృష్టే చంద్రేణ పురుష స్స్యాత్. 20

రిపుభయకలహానమేతో రణాపవాదాది దుఃఖితో దీనః,
బుధరాశౌ దినభర్తరి కుజేక్షితే భవతి సప్రీడః. 21
భూపతి చరితః ఖ్యాతో బాంధవసహితోఽరిభిశ్చ సంత్యక్తః,
బుధరాశౌ దినభర్తరి బుధదృష్టేఽత్యామయుత స్స్యాత్. 22
బహుశాస్త్రదారితముఖో రాజ్ఞాందూతో విదేశగశ్ఛండః,
బుధరాశౌ దినభర్తరి గురుణాదృష్ట స్సదోన్మాదః. 23
ధనదారపుత్రసుఖితోమంద స్నేహ స్తవనామయ స్సుఖితః,
బుధరాశౌ దినభర్తరి సితసందృష్టే భవే చ్చపలః. 24
బహుభృత్యోద్విగ్నమనా బహుబంధువిపోషణే సదానిరతః,
బుధరాశౌ దినభర్తరి సౌరేణ నిరీక్షితే కితవః. 25

జననకాలమున రవి బుధక్షేత్రములగు మిథునకన్యలయందుండి చంద్రాదిగ్రహములచే జూడఁబడెనేని శత్రువులవల్లను బంధువులవల్లను బ్రీడామొదలైనఫలములు గలుగును.

కర్మసు చపలః ఖ్యాతో గుణై ర్నృపాణాం స్వపక్షవిద్వేషీ,
స్త్రీదుర్భగ స్సురూపః కఫపిత్తార్త శ్శ్రమాభిసంతప్తః. 26
మద్యరుచి స్సుధర్మా మానీ వరవాక్య దేశదిగ్వేత్తా,
సూర్యే కుళీరసంస్థే బహుస్థితిః పితృగణద్వేష్టా. 27

సూర్యుఁడు కర్కటమందుండఁగాఁ బుట్టినవాఁడు కర్మలయందు చపలత్వము ఖ్యాతి మొదలైనఫలములు గలవాఁడగును.

రాజారాజసమోవా జలపణ్యధనస్థిరః క్రూరః,
కర్కటకే తీవ్రకరే దృష్టే శశినాభవే త్పురుషః. 28
శోషభగంధరరోగై స్సంతప్తో బంధుభిస్సహా విరక్తః,
కర్కటకే దిననాథే భౌమేన నిరీక్షితే పిశునః. 29
విద్యామానయశోభిః ఖ్యాతో నృపవల్లభో భవే న్నిపుణః,
సూర్యే కుళీరరాశౌ బుధేనదృష్టే విగతశత్రుః. 30
శ్రేష్ఠో రాజ్ఞో మంత్రీ సేనానాథోఽథ సంప్రసిద్ధశ్చ,
సూర్యే శశిభవనస్థే గురుణాదృష్టే బలాభ్యధికః. 31
స్త్రీసేవీయువతిధనః పరకార్యకరో రణే ప్రచండశ్చ,
కర్కటసంస్థే సూర్యే శుక్రేణ నిరీక్షితే ప్రియాలాపః. 32

కఫమారుతరోగార్తః పరస్వహారీ విలోమ మతిచేష్టః,
కర్కటసంస్థే భానౌ స్వపుత్రదృష్టే పుమాన్ పిశునః. 33

సూర్యుఁడు కర్కటకమందుండి చంద్రాదిగ్రహములచే జూడఁబడెనేని రాజతుల్యగుణములు గలవాఁడగును.

రిపుహంతా క్రోధపరో విశిష్టచేష్టో వనాద్రిదర్గచరః,
ఉత్సాహీ సచ్చూర శ్తేజస్వీ మాంసభక్షణో రౌద్రః. 34
గంభీర స్థిరసత్త్వో బధిరః క్షితిపాలకో ధనసమృద్ధః,
సింహస్థే దివసకరే ఖ్యాతః పురుషో భవే జ్జాతః. 35

రవి సింహమందుండఁగాఁ బుట్టినవాఁడు శత్రుజయము క్రోధము మొదలైనవి గలవాఁడగును.

మేధావీసుకళత్రః కఫార్తితో భూపవల్లభో మనుజః,
ఆదిత్యే సింహస్థే చంద్రేణ నిరీక్షితే భవతి. 36
పరదారరత శ్చూర స్సాహసకారీ కృతోద్యమో రౌద్రః,
దివసకరే సింహస్థే కుజేనదృష్టే ప్రధానశ్చ. 37
విద్వాన్ లిపిలేఖ్యకరః కితవాసేవీ పరిభ్రమతి హీనః,
సింహస్థే దివసకరే బుధేనదృష్టేన బహుసత్వః. 38
దేవారామతటాకాన్ కరోతి సత్వాధికో విజనశీలః,
సింహే సహస్రరశ్మౌ సురగురుదృష్టే సుహోబుద్ధిః. 39
దుర్నామకుష్ఠరోగై రభిభూతో నిర్దయో విగతలజ్జః,
సింహే తిమిరవినాశే శుక్రేణ నిరీక్షితే జాతః. 40
కార్యవినాశన దక్ష ష్షండోజాతః పరోపతాపకరః,
సింహస్థే దివసకరే స్వపుత్రదృష్టే పుమాన్ భవతి. 41

రవి సింహమందుండి చంద్రాదిగ్రహములచే జూడఁబడెనేని ధారణసమర్థమైన బుద్ధి యోగ్యమైనకళత్రము మొదలైనవి గలవాఁడగును.

స్త్రీతుల్యతను ర్హ్రీమాన్ లిపివేత్తా దుర్బలశ్చ వల్గుకథః,
మేధావీ బహుసత్వో విద్వాన్ శుశ్రూషక స్సురగురూణాం. 42
సంవాహనాదికర్మసు దక్షః శ్రుతిగేయవాద్యపరితుష్టః,
కన్యాయాం దివసకరే జాతో మృదుదీనవాక్యశ్చ. 43

రవి కన్యయందుండఁగాఁ బుట్టినవాఁడు స్త్రీశరీరమువంటి కాంతిగలవాఁడు, సిగ్గు మొదలైనవి గలవాఁడగును.

సంగతక్షయవ్యయార్తో విదేశమార్గాది లంపటోద్విష్టః,
నీచోపహతప్రీతి ర్హిరణ్యలోహాదిపణ్యజీవీచ. 44

ద్వేష్యః పరకర్మరతః పరదారరతిః పుమా న్భవే న్మలినః,
సూర్యే తులా ధరస్థే నృపపరిభూతః ప్రగల్భశ్చ. 45

రవి తులయందుండఁగా బుట్టినవాఁడు అన్యోన్యాభావముచేతను ధనక్షయము చేతను పీడపెట్టఁబడినవాఁడు, విదేశమందుండుట మొదలైనవి గలవాఁడగును.

అనివారితరణవేగ శ్శ్రుతిధర్మరతో నసత్యవా క్ఛూర్తః,
ప్రవినష్టదుష్టయువతిః క్రూరః కుస్త్రీవిధేయశ్చ. 46

క్రోధపరోఽసద్వృత్తో లోభిష్ఠః కలహావల్లభోఽనృతవాక్,
శస్త్రాగ్నివిషగ్రస్తః పితుర్జనన్యాశ్చ దుర్భగః కీటే. 47

రవి వృశ్చికమందుండఁగాఁ బుట్టినవాఁడు అనివారితరణవేగముగలవాఁడు, వేదమార్గమం దాసక్తిగలవాఁడు, సత్యవాక్యము మొదలైనవిగలవాఁడగును.

ద్రవ్యాన్వితో నృపేష్టో జాతః ప్రాజ్ఞ స్సురద్విజానురతః,
శస్త్రాస్త్రహ స్తిశిక్షా నిపుణో వ్యవహారయోగ్యశ్చ. 48

పూజ్య స్సతాం ప్రశాంతో ధనవా న్విస్తీర్ణపీనచారుతనుః,
బంధూనాం హితకారీ సత్వయుతః కార్ముకే సూర్యే. 49

సూర్యుఁడు ధనుస్సుయందుండఁగాఁ బుట్టినవాఁడు ద్రవ్యముగలవాఁడు, రాజప్రియుఁడు, దేవబ్రాహ్మణభక్తి మొదలైనవిగలవాఁడగును.

వాగ్బుద్ధివిభవపుత్రై స్సమన్వితో నృపసమో విగతశోకః,
వాక్పతిరాశౌ తపనే దృష్టే చంద్రేణ కుశరీరః. 50

సంగ్రామే లబ్ధయశా స్స్ఫుటవచనో విత్తసౌఖ్యసంపన్నః,
సూర్యే వాక్పతిరాశౌ భౌమేన నిరీక్షితే చండః. 51

మధురవచనో లిపిజ్ఞః కావ్యకలాగోష్ఠియానధాతుజ్ఞః,
గురుభే సవితరి దృష్టే బుధేన జనసమ్మతో భవతి. 52

విచరతి నరేంద్రభవనే నృపతి ర్వా వారణాశ్వధనయుక్తః,
సురగురుగృహే వివస్వతి గురుణా దృష్టే సదావిద్వాన్. 53

దివ్యస్త్రీభోగయుత స్సుగంధమాల్యాదిభి స్సహితః,
సురగురుభవనే భానౌ శుక్రేణ నిరీక్షితే శాంతః. 54

అశుచిః పరాన్నకాంక్షీ నీచానురత శ్చతుష్పదః క్రీడః,
దేవేజ్యగృహే సూర్యే మందేన నిరీక్షితే భవతి. 55

సూర్యుఁడు గురుక్షేత్రములగు ధనుర్మీనములయందుండి చంద్రాదిగ్రహములచే జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు సువాక్కు సుబుద్ధి మొదలైనవి గలవాఁడగును.

లుబ్ధః కుస్త్రీసక్తః కుకర్మసంవర్ధిత స్సత్తృష్ణశ్చ,
బహుకార్యరతో భీరు ర్విహీనబంధు శ్చలప్రకృతిః. 56

అటనప్రియోఽల్పసత్వ స్స్వపక్షవిక్షోభ నాశితసమస్తః,
మకరస్థే దివసకరే జాతో బహుభక్షకః పురుషః. 57

సూర్యుఁడు మకరమందుండఁగాఁ బుట్టినవాఁడు లుబ్ధుఁడు, దుష్టస్త్రీయందాసక్తి మొదలైనవి గలవాఁడగును.

మాయాపటు శ్చలమతి స్త్రీసంగా న్నష్టధనసౌఖ్యః,
మందగృహే తీవ్రకరే చంద్రేన నిరీక్షితే భవతి. 58

వ్యాధిభి రరిభి ర్గ్రస్తః పరకలహో త్యస్త్రవిక్షతశరీరః,
మందగృహే తిమిరరిపౌ భౌమేన నిరీక్షితే భవతి. 59

శూర షండ ప్రకృతిః పరస్వహారీ ససారసర్వాంగః,
నలినీదయితే శనిభే బుధేన సంవీక్షితే భవతి. 60

శోభనకర్తా మతిమా న్సర్వేషా మాశ్రయో విపులకీర్తిః,
కోణగృహే దినభర్తరి గురుణా దృష్టే మనస్వీచ. 61

శంఖప్రవాళమణిభి ర్జీవతి వేశ్యాంగనాధనసమృద్ధః,
కోణభవనే దినేశే భృగుణా దృష్టే సుఖీజాతః. 62

ధ్వంసయతి శత్రుపక్షం నరేంద్రసన్మానవర్ధితాశ్వాసః,
భానౌ శనైశ్చరగృహే శనిదృష్టే సూయతే యోఽసౌ. 63

సూర్యుఁడు శనిక్షేత్రములగు మకరకుంభములయందుండి చంద్రాదిగ్రహములచే జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు మాయసేయుటయందు సమర్థుఁడు, చంచలబుద్ధి మొదలైనవి గలవాఁడగును.

హృద్రోగీ బహుసత్వ స్సుతాం విగర్హ్యోఽతిరోషశ్చ,
పరదారాణాం సుభగః కర్మస్వితి నిశ్చితో భవతి. 64

దుఃఖప్రాయోఽల్పధన శ్చర శ్చలితసౌహృదో మలినమూర్తిః,
కుంభధరేఽర్కేజాతః పిశునస్స్యా ద్దుష్టశీలాపశ్చ. 65

సూర్యుఁడు కుంభమందుండఁగాఁ బుట్టినవాఁడు హృదయరోగము గొప్ప బలము మొదలైనవి గలవాఁడగును.

సుహృదాం సంగ్రహశీల స్త్రీస ప్రీత్యా లబ్ధసౌఖ్యసంభారః,
ప్రాజ్ఞో బహుశత్రుఘ్నః క్షయోదయీ భవతి ధనకీర్త్యా. 66
సత్సుతభృత్యా ప్తయశా జలపణ్యధన స్సువా గనృతవాదీ,
ఊర్జితగుహ్యరుగార్తో బహుసహజో మీనసంస్థేఽర్కే. 67

సూర్యుఁడు మీనమందుండఁగాఁ బుట్టినవాఁడు స్నేహితులుగలవాఁడు, స్త్రీమూలముగ రాబడినధనము మొదలైనవి గలవాఁడగును.

ఇతి ద్వావింశోఽధ్యాయః.

## చంద్రచారమును దెలుపు ఇరువదిమూఁడవ యధ్యాయము.

సౌవర్ణాంగ స్థిరస్వ స్సహజవిరహిత స్సాహసీ మానభద్రః
కామార్తః క్షామజానుః కునఖతనుకచ శ్చంచలో మానవిత్తః,
పద్మాభైః పాణిపాదై ర్వితతసుతజనో వక్తులాకారనేత్ర
స్సస్నేహ స్తోయభీరు ర్వ్రణవికృతశిరా స్త్రీజితో మేష ఇందౌ. 1

జననకాలమున చంద్రుఁడు మేషమందుండెనేని ఎఱ్ఱనిశరీరము స్థిరమైనధనము గలవాఁడు, సోదరులు లేనివాఁడు, సాహసము మొదలైనవి గలవాఁడగును.

అత్యుగ్రతరో నృపతిః ప్రణతానాం మార్దవం భజతి జాతః,
ధీర స్సంగ్రామరుచీ రవిణాదృష్టే శశిని మేషే. 2

చంద్రుఁడు మేషమందుండి రవిచే చూడఁబడఁగాఁ బుట్టినవాఁడు ఉగ్రస్వభావముగలవాఁడు, ప్రభువు దయ మొదలైనవి గలవాఁడగును.

దంతాక్షిరోగత ప్త శ్శిఖివాతాదిక్షతశరీరః,
మాండలికస్స్యా న్మేషే కుజదృష్టే శశినిభూతా ర్తః. 3
నానావిద్యాచార్య స్సదావాక్య స్సాన్య న్మనోభీష్టః,
బుధదృష్టే మేషస్థే నిశాకరే సత్కవి ర్విపులకీర్తిః. 4
బహుభృత్యధనసమృద్ధో నృపతే స్సచివ శ్చమూపతిర్వాఽపి,
మేషగృహే హిమరశ్మౌ దృష్టే గురుణా పుమాన్ జాతః. 5
సుభగ స్సుతధనయుక్తో వరయువతి విభూషణోఽల్పభోక్తా చ,

మేషే శిశిరమయూఖే భృగుతనయనిరీక్షితే భవతి. 6
విద్విష్టో బహుదుఃఖో దారిద్ర్యతను ర్మలీమసోఽనృతవాక్,
మేషే శిశిరమయూఖే రవితనయనిరీక్షితే భవతి. 7

చంద్రుఁడు మేషమందుండి కుజాదిగ్రహములచే జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు క్రమముగా దంతరోగము మొదలైనవి గలవాఁడగును. (బుట్టినవాఁడు అనుపదము అంతట తెలియఁదగినది.)

వృత్తాఢ్యోరస్కోఽతిదాతా ఘనకుటిలకచః కాముకః కీర్తిశాలీ
కాంతః కన్యాప్రజావాన్ వృషసమనయనో హంసలీలాప్రచారః,
మధ్యాంతే భోగభాగీ పృథుకటిచరణ స్కంధజాన్వాస్యజంఘ
స్సాంకః పార్శ్వాస్యపృష్ఠే కకుది శుభగతిః క్షాంతియుక్తో గవీందౌ.

జననకాలమున చంద్రుఁడు వృషభమందుండిన గొప్ప వక్షస్థలము దాతృత్వము మొదలైనవి గలవాఁడగును.

కర్షక మతికర్మకరం ద్విపదచతుష్పాదై స్సమృద్ధంచ,
ప్రాయోగికం ప్రకురుతే వృషభే రవివీక్షిత శ్చంద్రః. 9
అతికామం కుజదృష్టో యువతీకృతే నష్టనారమిత్రజనం,
హృదయహరం నారీణాం మాతు ర్నశుభం శశీవృషే కురుతే. 10
ప్రాజ్ఞం వాక్యవిధిజ్ఞం ప్రముదిత మిష్టం సమస్తభూతానాం,
జనయతి బుధేన దృష్ట శ్శశీ వృషేఽనుపమగుణై ర్యుక్తమ్. 11
స్థిరపుత్రదారసహృదం మాతాపితృభక్తిమంత మతినిపుణం,
ధార్మిక మతివిఖ్యాతం గవిగురుదృష్ట శ్శశీ కురుతే. 12
భూషణయానగృహాణాం శయనాసనగంధవస్త్రమాల్యానాం,
భాగిన ముపభోక్తారం సితేక్షితో యది శశీ కురుతే. 13
ధనహీన మసిష్టకరం వృషభే ద్వేష్యం సదాచ యువతీనాం,
సుతమిత్రబంధుసహితం రవిసుతదృష్ట శ్శశీ కురుతే. 14

జననకాలమున చంద్రుఁడు వృషభమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని కర్షణయం దాసక్తిగలవాఁడు, పశుసమృద్ధి మొదలైనవి గలవాఁడగును.

పూర్వార్ధే సంభూతో జననీమృత్యుంకరోతి నచిరేణ,
పశ్చాదర్ధే వృషభే పితుర్వియోగం శశీ కురుతే. 15

జననకాలమున చంద్రుఁడు వృషభపూర్వార్ధమందుండిన తల్లి శీఘ్రముగ మృతినొందును. ఉత్తరార్ధమందుండెనేని శీఘ్రముగ తండ్రి మృతినొం

డును. అనఁగా కృత్తికానక్షత్ర ౨-౩-౪ చరణములు రోహిణిప్రథమచరణము ద్వితీయచరణములో సగము కలసి పూర్వార్ధము. శేషము ఉత్తరార్ధము.

ఉన్నాస శ్శ్యామచక్షు స్సురతవిధికలా కావ్యకృద్భోగభాగీ
హాస్తే మత్స్యాధిపాంకో విషయసుఖరతో బుద్ధ్యదాతు స్సిరాలః,
కాంతస్సౌభాగ్యహాస్యప్రియవచనయుతస్త్రీజితో వ్యాయతాంగో
యాతి క్లీబైశ్చ సఖ్యం శశిని మిథునగే మాతృయుగ్మప్రపుష్టః. 16

చంద్రుఁడు మిథునమందుండఁగాఁ బుట్టినవాఁడు పొడవైనముక్కు, శ్యామ వర్ణముగల నేత్రములు మొదలైనవి గలవాఁడగును.

ప్రజ్ఞాధనం ప్రకాశం మిథునే రూపాన్వితం సుధర్మిష్ఠం,
అతిదుఃఖిత మల్పార్థం కరోతి సూర్యేక్షిత శ్చంద్రః. 17
అతిశూర మతిప్రాజ్ఞం సుఖవాహనవిభవరూపసంపన్నం,
కురుతే మిథునే చంద్రో వక్రేణ నివక్షితో ఽపశ్యమ్. 18
అర్థోత్పాదనకుశలం కురుతే హ్యపరాజితం సుధీరంచ,
పార్థివ ముఖండితాజ్ఞం మిథునే బుధవీక్షిత శ్చంద్రః. 19
విద్యాశాస్త్రాచార్యం విఖ్యాతం సత్యవాచ మతిరూపం,
మాన్యం వాగ్మిన మిందుః కరోతి గురువీక్షితో మిథునే. 20
వరయువతిమాల్యవస్త్రై ర్వరవాహనయానభూషణై ర్మణిభిః,
క్రీడాం కురుతే పురుషో భృగుదృష్టే శశిని మిథునస్థే. 21
కురుతే బాంధవరహితం యువతిసుఖవిభూతివర్జితం చాపి,
అధనం లోకద్వేష్యం జితుభే శనినేక్షిత శ్చంద్రః. 22

చంద్రుఁడు మిథునమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని ప్రజ్ఞ కాంతి ధర్మము మొదలగుఫలములు క్రమముగా కలుగును.

యుక్తస్సౌభాగ్యయోగై ర్గృహసుహృదటనజ్యోతిషజ్ఞానశీలైః
కామాసక్తః కృతజ్ఞః క్షితిపతిసచివ స్సత్ప్రమాణః ప్రవాసీ,
సోన్మాదః కేశకల్పో జనకుసుమరుచి ర్హానివృద్ధ్యానుయాతః
ప్రాసాదోద్యానవాపీ ప్రియకరణరతః పీనకంఠః కుళీరే. 23

చంద్రుఁడు కర్కటకమందుండఁగాఁ బుట్టినవాఁడు సౌభాగ్యము మొదలైనవి గలవాఁడగును.

నరపతిపురుష మధన్యం ధనరహితం క్లేశకారకం వాఽపి,
కురుతే స్వగృహే చంద్రో రవిదృష్టో దుర్గపాలంచ. 24

శూరం వికలశరీరం మాతురనర్థావహం ప్రియం దక్షం,
క్షితితనయవీక్షితతను ర్జనయతి చంద్రో నరం స్వగృహే. 25
అవికలమతిం నయజ్ఞం జనయతి బుధవీక్షిత శ్శశీ స్వగృహే,
ధనదారపుత్రవంతం నృపసచివం సౌఖ్యవంతంచ. 26
నృపతిం నృపగుణయుక్తం జనయతి చంద్ర స్సురేజ్యసందృష్టః,
స్వగృహే సుఖితసుభార్యం నయవినయపరాక్రమాక్రాంతమ్. 27
ధనకనకవస్త్రయోషిద్రత్నానాం భాజనం శశీ కురుతే,
కర్కటకేసితదృష్టో వేశ్యాజననాయకం కాంతమ్. 28
అటనమసుఖం దరిద్రం మాతురనిష్టం ప్రియానృతం పాపం,
శనినా దృష్ట స్స్వగృహే కరోతి చంద్రో నరం నీచం. 29

చంద్రుఁడు స్వక్షేత్రమగు కర్కటకమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు రాజపురుషాది గుణయుక్తుఁడగును.

స్థూలాస్థి ర్మందరోమా పృథువదనగళో హ్రస్వపింగాక్షియుగ్మః
స్త్రీద్వేషీ క్షుత్పిపాసా జఠరదరరుజా పీడితో మాంసభక్షః,
దాతాతీక్ష్ణో హ్యపుత్రో విపినగరతి ర్మాతృవశ్య స్సువక్షాః
విక్రాంతః కార్యలాపీ శశభృతిరవిభే సర్వగంభీరదృష్టః. 30

చంద్రుఁడు సింహమందుండఁగాఁ బుట్టినవాఁడు స్థూలమైన ఎముకలు మొదలైనవి గలవాఁడగును.

నృపతిసపత్నం కురుతే ప్రోత్కృష్టగుణం మహాస్పదం వీరం,
రవిణాదృష్ట స్సింహే పాపరతం విశ్రుతం చంద్రః. 31
సేనాపతిం ప్రచండం నరయువతిసుతార్థవాహనోపేతం,
జనయ త్యుత్తమపురుషం కుజేక్షిత శ్చంద్రమా స్సింహే. 32
స్త్రీసత్వం స్త్రీలలితం స్త్రీవశ్యం యువతి సేవకం సింహే,
కురుతే బుధేనదృష్టో ధనసుఖయోగాన్వితం చంద్రః. 33
అభిజాతం కులపుత్రం బహుశ్రుతం గుణసమృద్ధంచ,
కురుతే నరేంద్రతుల్యం గురుదృష్ట శ్చంద్రమా స్సింహే. 34
ప్రమదావిభవై ర్యుక్తం రోగిణమపి యువతి సేవకం కురుతే,
సురతవిధిజ్ఞం ప్రాజ్ఞం శశీహరౌ శుక్రసందృష్టః. 35
కర్షక మధనం కురుతేఽనృతవాచం దుర్గపాలకం సింహే,
రవిజేన తదా దృష్టో యువతి సుఖై ర్హీన మల్పకం చ శశీ. 36

చంద్రుఁడు సింహమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని రాజద్వేషము మొదలగుఫలములు జరుగును.

స్త్రీలోలోలంబబాహు ర్గలితతనుముఖ శ్చారుదంతాక్షికర్ణో
విద్వా నాచార్యధర్మాప్రియవచనయుత స్సత్యశౌచప్రధానః,
ధీర స్సత్త్వానుకంపీ పరవిషయరతః క్షాంతిసౌభాగ్యభాగీ
ప్రాయః కన్యాప్రసూతి ర్బహుసుతరహితః కన్యకాయాం శశాంకే.

చంద్రుఁడు కన్యయందుండఁగాఁ బుట్టినవాఁడు స్త్రీలోలుఁడు, గొప్పబాహువులు సుందరమైనశరీరము మొదలైనవి గలవాఁడగును.

నృపకోశకరం ఖ్యాతం గృహీతవాక్యం విశిష్టకర్మాణాం,
కన్యాయాం రవిదృష్టో భార్యాహీనం శశీకురుతే. 38
శిల్పాచార్యం ఖ్యాతం ధనవంతం శిక్షితం సుధీరంచ,
కన్యాయాం కుజదృష్టో మాతురనిష్టం శశీకురుతే. 39
జ్యోతిషకావ్యవిధిజ్ఞం వివాదకలహేషు విజయినం సుతరాం,
సాతిశయం కన్యాయాం జనయతి నిపుణం బుధేక్షిత శ్చంద్రః. 40
బంధుజనాఢ్యం సుఖినం నృపకృత్యకరం గృహీతవాక్యం చ,
కన్యాయాం గురుదృష్టో జనయతి విభవాన్వితం చంద్రః. 41
కన్యాయాం బహుదారం వివిధాలంకారభోగినమథాఢ్యం,
సతత మిహోర్జిత ముదితం కురుతే భృగుణా నిరీక్షిత శ్చంద్రః. 42
అన్యగృహస్మృతిం దరిద్రం సుఖరహితమమాతృకం యువతి వశ్యం,
కన్యాయాం యమదృష్ట స్త్రీభోగ్యధనం శశీకురుతే. 43

చంద్రుఁడు కన్యయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు రాజమందిరమున ధనగారాధిపతియు ఖ్యాతి మొదలైనవి గలవాఁడగును.

ఉన్నాసో వ్యాయతాక్షః కృతవదనతను ర్భూరిదారో వృషాఢ్యో
గోభూఢ్య శ్చాచసారో వృషసమవృషణో విక్రమజ్ఞః క్రియేశః,
భక్తో దేవద్విజానాం బహువిభవయుత స్త్రీజితో హీనదేహో
ధాన్యాదానైకబుద్ధి స్తులిని శశధరే బంధువర్గోపకారీ. 44

చంద్రుఁడు తులయందుండఁగాఁ బుట్టినవాఁడు పొడవైనముక్కు విశాలమైన నేత్రములు మొదలైనవి గలవాఁడగును.

అధనం వ్యాధితమటనం పరిభూతం భోగవిప్రయుక్తంచ,
అసుతమసారంజూకే జనయతి రవివీక్షిత శ్చంద్రః. 45

తీక్ష్ణం చోరం క్షుద్రం పరయోషిద్గంధమాల్యసంయుక్తం,
మతిమన్నయనాతురగం జనయతి వక్రే క్షిత శ్చంద్రః. 46
దృష్టోబుధేన చంద్రః కలావిదగ్ధం ప్రభూతధనధాన్యం,
శుభవాక్యం విద్వాంసం దేశఖ్యాతం తులాధరే కురుతే. 47
జీవేక్షిత స్తులాయాం జనయతి సర్వత్ర పూజితం హిమగుః,
క్రయవిక్రయేషు కుశలం రత్నాదిషు భాండజాతేషు. 48
లలిత మరోగం సుభగం సముపచితాంగం ధనాన్వితం ప్రాజ్ఞం,
వివిధోపాయవిధిజ్ఞం కురుతే భృగువీక్షిత శ్శశీతులకే 49
కురుతే శశీధనాఢ్యం ప్రియవాక్యం వాహనై ర్యుతం జూకే,
విషయరతిం సుఖరహితం భాస్కరి దృష్టో యుతం మాతుః. 50

చంద్రుఁడు తులయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడఁగాఁ బుట్టిన వాఁడు నిర్ధనుఁడు, వ్యాధిమొదలైనవి గలవాఁడగును.

లుబ్ధో వృత్తోరుజంఘః కఠినతరతను ర్నాస్తికః క్రూరచేష్ట
శ్చోరో బాల్యే రుగార్తో హృతచిబుకనఖ శ్చారునేత్ర స్సమృద్ధః,
కర్మోద్యుక్తః ప్రకటః పరయువతిరతో బంధుహీనః ప్రమత్త
శ్చండో రాజ్ఞా హృతస్వః పృథుజఠరశిరాః కీటభే శీతరశ్మౌ. 51

చంద్రుఁడు వృశ్చికమందుండఁగాఁ బుట్టినవాఁడు లుబ్ధుఁడు, గుండ్రమై తొడలు పిక్కలు కఠినమైనశరీరము మొదలైనవి గలవాఁడగును.

కురుతే లోకద్వేష్యం బుధమటనం విత్తవంతంచ,
దినకరదృష్టోఽలిగత శ్చంద్ర స్సుఖవర్జితం పురుషమ్. 52
అనుపమధైర్యం కురుతే నృపతిసమం వృశ్చికే విభూతియుతం,
శూరమజయ్యం సమరే ప్రభక్షణం భూమిజేన సందృష్టః. 53
అచతుర మనృష్టవాక్యం యమలాపత్యం చ యుక్తివంతం చ,
జనయతి బుధేన దృష్టః కూటకరం వృశ్చికే చ గీతజ్ఞః. 54
కర్మాసక్తం కురుతే లోకద్వేష్యం చ విత్తవంతం చ,
గురుణా దృష్టోఽలిగతో నిశాకరో రూపవంతం చ. 55
అతిమదమతీవసుభగం ధనవాహనభోగలలిత మిహ కీటే,
యువతివినాశితసారం జనయతి భృగువీక్షిత శ్చంద్రః. 56
నీచాపత్యం కృపణం వ్యాధిత మధనం చ సత్యహీనం చ,

జనయత్యంశకదృష్టో నరమధనం చంద్రమాఃకీటే. 57

చంద్రుఁడు వృశ్చికమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడఁగాఁ బుట్టిన వాఁడు జనద్వేషము మొదలైనఫలములు గలవాఁడగును.

కుబ్జాంగో వృత్తనేత్రః పృథుహృదయకటిః పీనబాహుః ప్రవక్తా
దీర్ఘాంసో దీర్ఘకంఠో జలతటవసతి శ్శిల్పవిద్గూఢగుహ్యః,
శూరోదృష్టోఽస్థిసారో వితతబహుబలస్థూలకంఠోష్ఠఘోణో
బంధుస్నేహీ కృతజ్ఞో ధనుషి శశిధరే సంహితాంఘ్రిః ప్రగల్భః. 58

చంద్రుఁడు ధనుస్సునందుండఁగాఁ బుట్టినవాఁడు పొట్టిశరీరము వర్తులమైన నేత్రములు మొదలైనవి గలవాఁడగును.

. నృపతి మధాఢ్యం కురుతే శూరం విఖ్యాతపౌరుషం చాపే,
భాస్కరదృష్ట శ్చంద్ర స్త్వనుపమసుఖవాహనోపేతమ్. 59
సేనాపతిం సమృద్ధం సుభగం ప్రఖ్యాతపౌరుషం పురుషం,
జనయ త్యనుపమభృత్యం క్షితిసుతదృష్ట శ్శశీధనుషి. 60
బహుభృత్యం త్వాకారం జ్యౌతిషశిల్పక్రియాదినిపుణం చ,
బుధదృష్టో హిమరశ్మి ర్నాగ్నాచార్యం హయే కురుతే. 61
అనుపమదేహం కురుతే పృథ్వీపాలస్య మంత్రిణం చాపే,
త్రిదశగురుదృష్టమూర్తి ర్ధనధర్మసుఖాన్వితం చంద్రః. 62
సుఖినమతీవ హి లలితం సుభగం పుత్రార్థకామవంతంచ,
చాపే సుమిత్రభార్యం భార్గవదృష్టః కరోతీందుః. 63
ప్రియవాదినం సువాక్యం బహుశ్రుతం సత్యవాదినం సౌమ్యం,
అభిజాతం నృపపురుషం జనయతి సౌరే క్షిత శ్శశీ ధనుషి. 64

చంద్రుఁడు ధనస్సునందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడఁగాఁ బుట్టిన వాఁడు రాజధనము మొదలైనవి గలవాఁడగును.

గీతజ్ఞ శ్శీతభీరుః పృథుతరశిరా స్సత్యధర్మోపసేవీ
ప్రాంశుఃఖ్యాతో ఽల్పరోషో మనసి భవయుతో నిర్ఘృణ స్త్యక్తలజ్జః,
చార్వక్షః క్షామదేహో గురుయువతిరత స్సత్కవి ర్వృత్తజంఘో
మందోత్సాహోఽతిలుబ్ధ శ్శశిని మకరగే దీర్ఘకంఠోఽతికర్ణః. 65

చంద్రుఁడు మకరమందుండఁగాఁ బుట్టినవాఁడు గీతమును దెలిసినవాఁడు, శీతమునకు భయపడువాఁడు, గొప్పశిరస్సు సత్యము ధర్మము మొదలైనవి గలవాఁడగును.

అధనం దుఃఖితమటనం పరకర్మరతం మలీమసం కురుతే,
మకరే కుపలయనాథ శ్శిల్పమతిం వీక్షితో రవిణా. 66
అతివిభవ మత్యుదారం సుభగం ధనసంయుతం మృగేపురుషం,
వాహనయుతం ప్రచండం కరోతి వక్రే క్షితశ్చంద్రః. 67
మూర్ఖం ప్రవాసశీలం గతయువతిం చంచలం మృగేతీక్ష్ణం,
జనయతి బుధేన దృష్ట స్సుఖరహితం నిర్ధనం పురుషమ్. 68
భూపతి మనుపమవీర్యం నృపతిగుణై స్సంయుతం మృగేజాతం,
బహుదారపుత్రమిత్రం జనయతి గురువీక్షిత శ్చంద్రః. 69
వరయువతిధనవిభూషణవాహనమాలాన్వితం నరం మకరే,
సోపక్రోశ మపుత్రం జనయతి భృగువీక్షిత శ్చంద్రః. 70
అలసం మలినం సధనం మకనార్తం పారదారిక మసత్యం,
దివసకరపుత్రదృష్టః కరోతి చంద్రో నరం మకరే. 71

చంద్రుఁడు మకరమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడఁగాఁ బుట్టిన వాఁడు నిర్ధనుఁడు, దుఃఖము మొదలైనవి గలవాఁడగును.

ఉష్ణోర్ణోరూక్షదేహః పృథుకరచరణో మద్యపానప్రసక్త
స్సద్వేష్యో ధర్మహీనః పరసుతజనక స్థూలమూర్ధాకునేత్రః,
శాఠ్యాలస్యాభిభూతో విపులముఖకటి శ్శిల్పవిద్యాసమేతో
దుశ్శీలో దుఃఖతప్తో ఘటభ ముపగతే రాత్రినాథే దరిద్రః. 72

చంద్రుఁడు కుంభమందుండఁగాఁ బుట్టినవాఁడు పొడవైనముక్కు విఘర్ణమైనదేహము పొడవైన కరచరణములు మొదలైనవి గలవాఁడగును.

అతిమలినమతిచశూరం నృపరూపం ధార్మికం కృషికరంచ,
కురుతే దినకరదృష్టో ఘటధరసంస్థః క్షపానాథః. 73
కుంభేఽతిసత్యవాక్యం మాతృగురుధనై ర్వియుక్తమలసం చ,
విషమం పరకార్యరతం కరోతి భౌమేక్షిత శ్చంద్రః. 74
శయనోపచారకుశలం గీతవిధిజ్ఞం ప్రియంచ యువతీనాం,
తనువిభవసుఖం పురుషం కరోతి బుధవీక్షిత శ్శశీ కుంభే. 75
గ్రామక్షేత్రతరూణాం వరభవనానాం వరాంగనానాం చ,
కురుతే భోగిన మార్యం సాధుం గురువీక్షిత శ్శశీ కుంభే. 76
నీచ మపుత్ర మిత్రం కాతర మమాచార్యనిందితం పాపం,
కురుతే శశీకుయువతిం సితేక్షితో ఘటధరేఽల్పసుఖమ్. 77

నఖరోమధరం మలినం పరదారరతం శఠం విధర్మాణాం,
స్థావరభాగిన మాఢ్యం శశీఘటే సౌరసందృష్టః. 78

చంద్రుఁడు కుంభమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడఁగాఁ బుట్టిన వాఁడు అతిమలినము శౌర్యము సౌందర్యము ధర్మము మొదలైనవి గలవాఁడగును.

శిల్పోత్పన్నాధికారో హితజయనిపుణ శ్శాస్త్రవిచ్చారుదేహో
గేయజ్ఞో ధర్మనిష్ఠో బహుయువతిరత స్సౌఖ్యభాగ్భూపసేవీ,
ఈమతోక్షపో మహాత్మా స్సుఖసిధిధనభా క్స్త్రీజిత స్సత్వభావో
యానాసక్త స్సముద్రే తిమియుగలగతే శీతగా దానశీలః. 79

చంద్రుఁడు మీనమందుండఁగాఁ బుట్టినవాఁడు శిల్పశాస్త్రనిపుణుఁడు, పరహితవు మొదలైనవి గలవాఁడగును.

తీవ్రమదనం ప్రకాశం సుఖినం సేనాపతిం ధనసమృద్ధం,
జనయతి దినకరదృష్ట స్సుముదితభార్యం శశీమీనే. 80

పరిభూతం సుఖరహితం కులటాపుత్రం చ పాపనిరతం చ,
జనయతి నక్షత్రపతిం క్షితిసుతదృష్టో ఝషే శూరమ్. 81

జనయతి బుధేన దృష్టో మీనస్థశ్చంద్రమాః పురుషం,
భూపతి మతీవ సుఖినం వరయువతిసమావృతం వశ్యమ్. 82

గురుదృష్టో మీనస్థో లలితం చంద్రోఽగ్రమాండలికం,
అత్యాఢ్యం సుకుమారం బహుభి స్స్త్రీభి ర్వృతం జనయేత్. 83

కురుతే శశీ సుశీలం రతిమంతం నృత్యవాద్యగేయరతం,
శుక్రే క్షితో ఝషస్థో హృదయహారం కామినీనాం చ. 84

వికలహితం జనన్యాః కామార్తం పుత్రదార మతిహీనం,
కురుతే రవిసుతదృష్టో నీచవిరూపాంగనాసక్తమ్. 85

చంద్రుఁడు మీనమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడఁగాఁ బుట్టిన వాఁడు కామము మొదలైనవి గలవాఁడగును.

రాశిపతౌ బలయుక్తే రాశౌ చ బలాన్వితే తథాచంద్రే,
రాశిఫలం స్యా త్సకలం నీచోచ్చవిధినా చ సంచింత్యమ్. 86

పూర్వము జెప్పినఫలము రాశ్యధిపతి, రాశి, చంద్రుఁడు బలవంతములై

యుండెనేని సంపూర్ణముగాఁ జెప్పఁదగినది అట్లుగాక నీచాదులను పొందిరేని నిష్ఫలమని తెలియఁదగినది. మిశ్రముమగనుండెనేని మిశ్రమఫలమాలోచింపఁదగినది.

ఇతి త్రయోవింశోధ్యాయః.

---

## అంశయందున్న చంద్రచారఫలమును దెలుపు ఇరువదినాలవ యధ్యాయము.

భౌమేంశే కుజదృష్టో నికర్తన శ్చంద్రమాః ప్రచండశ్చ,
జనయతి మాయాబహుళం ప్రపంచకం సూర్యజేన కిలపురుషమ్.

పూర్ణచంద్రుఁడు కుజాంశయంగుండి కుజునిచే జూడఁబడఁగాఁ బుట్టిన వాఁడు కపటముగలవాఁడు, శనిచే జూడఁబడెనేని నై పరీత్యము గలవాఁడు అగును.

సూర్యేణ చోరఘాతక మథవా ప్యారక్షకం శూరం,
జీవేన మనుజనాథం ఖ్యాతం విద్వత్సమాగాఢ్యమ్. 2

సూర్యునిచే జూడఁబడెనేని చోరులను శిక్షించువాఁడు, లేక రక్షించువాఁడు, శూరుఁడు అగును. గురునిచే జూడఁబడెనేని విద్వన్మాన్యుఁడగును.

శుక్రేణ నృపతి సచివం ధనాన్వితం స్త్రీవిలేపనానురతం,
శీఘ్రం వదంతి చపలం సౌమ్యేన నిరీక్షితే చంద్రే. 3

శుక్రునిచే జూడఁబడెనేని రాజమంత్రి, ధనికుఁడు, స్త్రీలోలుఁడు అగును. బుధునిచే జూడఁబడెనేని చపలుఁడగును.

సితభాగే సితదృష్టే యోషిద్వస్త్రాన్నపానధనసౌఖ్యం,
జనయతి బుధేన చంద్రో వాద్యజ్ఞం నృత్తగేయపరమ్. 4

చంద్రుఁడు శుక్రనవాంశయందుండి శుక్రునిచే జూడఁబడెనేని స్త్రీసౌఖ్యము వస్త్రసౌఖ్యము భోజనసౌఖ్యము ధనసమృద్ధము గలవాఁడగును. బుధునిచే జూడఁబడెనేని గానశాస్త్రజ్ఞుఁడగును.

గురుణాకవిప్రదానం సయశాస్త్రవిశారదం నృపసచివం,
పరధారదర్శనపరం కామినమారేణ బహుభృత్యమ్. 5

గురునిచే జూడఁబడెనేని కవిశ్రేష్ఠుఁడు, నీతిశాస్త్రజ్ఞుఁడు, రాజమంత్రి యగును. కుజునిచే జూడఁబడెనేని పరదారాసక్తి గలవాఁడు, కాముకుఁడు, అనేకభృత్యులు గలవాఁడు అగును.

సూర్యేణ మహామూర్ఖం ప్రియంవద సతత మన్నపానరుచిమ్,
సౌరేణ వర్ధకీనాం గుణైశ్చ సదృశం దిశతి చంద్రః. 6

సూర్యునిచే జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు మూర్ఖుఁడును, ప్రియమును బలుకువాఁడును అగును శనిచే జూడఁబడెనేని వడ్లవానిగుణములనంటి గుణములు గలవాఁడగును.

బుధభాగే బుధదృష్ట శ్శిల్పాచార్యం కవిం శశీ జనయేత్,
శుక్రేక్షితో విశాలం గేయజ్ఞం వచనసారాఢ్యమ్. 7

చంద్రుఁడు బుధనవాంశయందుండి బుధునిచే జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు శిల్పశ్రేష్ఠుఁడు, కవిత్వము దెలిసినవాఁడు అగును. శుక్రునిచే జూడఁబడెనేని గొప్ప మనుష్యుఁడు, గానము వచనసారము దెలిసినవాఁ డగును.

నృపమంత్రిణం గుణాఢ్యం గురుణా దృష్టః ప్రతిష్ఠితం కాంతమ్,
భౌమేక్షితేఽతిచోరం వివాదకుశలం నరం రౌద్రమ్. 8

గురునిచే జూడఁబడెనేని మంత్రి సద్గుణములు సౌందర్యము గలవాఁడగును. కుజునిచే జూడఁబడెనేని చోరుఁడు వివాదముసేయువాఁడు కోపముగలవాఁడు అగును.

శాస్త్రార్థకావ్యబుద్ధిం ప్రాజ్ఞం శిల్పిన మవేక్షిత శ్శనినా,
రంగచరం విఖ్యాతం జనయతి సూర్యేక్షిత శ్చంద్రః 9

శనిచే జూడఁబడెనేని శాస్త్రజ్ఞుఁడు శిల్పజ్ఞుఁడు అగును. సూర్యునిచే జూడఁబడెనేని తగిరిముతినువాఁడు, ఖ్యాతిగలవాఁడు అగును.

స్వాంశే దినకరదృష్ట శ్శశీకృశతను మవిక్షతశరీరం,
పరధనరక్షణనిపుణం లుబ్ధం నితరాం కుజేనాపి. 10

చంద్రుఁడు స్వాంశయందుండి రవిచే జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు కృశించినట్టియు కొట్టఁబడినట్టియు శరీరముగలవాఁడగును. కుజునిచే జూడఁబడెనేని పరద్రవ్యరక్షకుఁడు, లుబ్ధుఁడు అగును.

సౌరేణాకృత్యకరం వధబంధవివాదసంతప్తమ్,
శుక్రేణ స్త్రీద్వేష్యం జనయే దథవా నపుంసకాకారమ్. 11

శనిచే జూడఁబడెనేని అకృత్యములను సేయువాఁడు, బంధువివాదముచే తపించువాఁడు. శుక్రునిచే జూడఁబడెనేని స్త్రీద్వేషి లేక నపుంసకుఁడు అగును.

నృపమంత్రిణం నృపంవా జనయతి గురుణావలోకిత శ్చంద్రః,
సౌమ్యేనాధర్మకరం నిద్రాబహుళం చ సతత మధ్వరతమ్. 12

గురునిచే జూడఁబడెనేని రాజమంత్రిగాని లేక రాజు అగును. బుధునిచే జూడఁబడెనేని అధర్మము నిద్రాబహుళము, తిరుగుటయం దాసక్తిగలవాఁడు అగును.

రవిభాగే రవిదృష్టే సురోషణ స్సముపలబ్ధకీర్తిధనః,
పాపోనిర్దయఇందౌ సౌరేణ ప్రాణినాం హంతా. 13

చంద్రుఁడు రవినవాంశయందుండి రవిచే జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు రోషము కీర్తిగలవాఁడు, శనిచే జూడఁబడెనేని పాపుడు, నిర్దయగలవాఁడు, ప్రాణులను హింసించువాఁడు అగును.

భౌమేన సువర్ణధనం ఖ్యాతం నృపసత్కృతం ప్రచండతరం,
గురుణాదృష్టో జనయతి చమూపతిం వా నరేంద్రం వా. 14

కుజునిచే జూడఁబడెనేని సువర్ణము ఖ్యాతి మొదలైనవి గలవాఁడగును. గురునిచే జూడఁబడెనేని సేనాపతి లేక రాజు అగును.

శుక్రేణ దృష్టమూర్తి స్సుతార్థినం మృతసుతం వాఽపి,
సౌమ్యేన దైవచింతక మితిహాసరతం చ నిధిభాజమ్. 15

శుక్రునిచే జూడఁబడెనేని సుతులను గోరువాఁడు, లేక మృతసుతులు గలవాఁడు అగును. బుధునిచే జూడఁబడెనేని ఆస్తికబుద్ధి గలవాఁడు, కథలయం దాసక్తి గలవాఁడగును.

గురుభాగే గురుదృష్టో విశదం నృపవల్లభం విపులకీర్తిం,
జనయతి శశీ సితేన స్త్రీణాం భోగై స్సుసంయుక్తమ్. 16

చంద్రుఁడు గురునవాంశయందుండి గురునిచే జూడఁబడెనేని రాజప్రియుఁడు, గొప్పకీర్తిగలవాఁడు అగును. శుక్రునిచే జూడఁబడెనేని స్త్రీభోగము దాసక్తిగలవాఁడు అగును.

బుధదృష్టో హాస్యకరం నృపప్రియం నాయకం వరూధిన్యాః,
అస్త్రాచార్యం కురుతే కుజేక్షిత స్సర్వతః ఖ్యాతమ్. 17

బుధునిచే జూడఁబడెనేని హాస్యమును సేయువాఁడు, రాజప్రియుఁడు, సేనానాయకుఁడు అగును. కుజునిచే జూడఁబడెనేని అస్త్రవిద్యయందు నేర్పుగలవాఁడు, ఖ్యాతిగలవాఁడు అగును.

దోషై ర్వివిధైః ఖ్యాతం దినకరదృష్టో నరం ప్రమాణస్థం,
సౌరేణ వృద్ధశీలం బలిభిశ్చ నిరాకృతం నీచమ్. 18

రవిచే జూడఁబడెనేని అనేకదోషములచే ఖ్యాతినొందినవాఁడును, శనిచే జూడఁబడెనేని అలసుఁడు, ధనికులచే నిరాకరింపఁబడినవాఁడు, నీచుఁడు అగును.

సౌరాంశే శశిదృష్టః కృపణం రోగాన్వితం మృతసుతం వా,
సూర్యేణాల్పాపత్యం వ్యాధిగ్రస్తం విరూపతనుమ్. 19

చంద్రుఁడు శనినవాంశయందుండి శనిచే జూడఁబడెనేని లుబ్ధుఁడు, రోగము గలవాఁడు, మృతసుతులు గలవాఁడు అగును. రవిచే జూడఁబడెనేని స్వల్పసంతానము గలవాఁడు, వ్యాధిగలవాఁడు, అంగహీనమైన శరీరము గలవాఁడగును.

భౌమేన నరపతిసమం సాఢ్యం స్త్రీదుర్భగం సుఖై ర్యుక్తం,
శుక్రేణ విషమశీలం యువతిభి రవధీరితం ధీరమ్. 20

కుజునిచే జూడఁబడెనేని రాజతుల్యుఁడు, ధనికుఁడు, సుఖముగలవాఁడు అగును. శుక్రునిచే జూడఁబడెనేని విషమస్వభావముగలవాఁడు అగును.

సౌమ్యేన పాపనిరతం కుత్సితచరితం శశీ సదాదృష్టః,
గురుణా స్వకర్మనిరతం కురుతే పురుషం నచోదాత్తమ్. 21

బుధునిచే జూడఁబడెనేని పాపకర్మయందు దాసక్తిగలవాఁడు, ఆచారహీనుఁడు అగును. గురునిచే జూడఁబడెనేని స్వకర్మాసక్తిగలవాఁడు అగును.

వర్గోత్తమే స్వకీయే పరకీయనవాంశకే చ దృష్టిఫలం,
పుష్టం మధ్యం స్వల్పం విపరీతం స్యా దనిష్టఫలమ్. 22

చంద్రుఁడు వర్గోత్తమనవాంశయందుండెనేని గ్రహదృష్టిజనకమైనశుభఫలము సంపూర్ణముగ గలుగును. స్వనవాంశయందుండెనేని మధ్యమముగ నుండును. పరనవాంశయందుండెనేని శుభఫలము కొంచెముగ నుండును. పరనవాంశయందున్న చంద్రునికి చెప్పిన అనిష్టఫలము విశేషముగ నుండును. స్వనవాంశయందున్న చంద్రునికి చెప్పిన అనిష్టఫలము మధ్యమముగ జరుగును. వర్గోత్తమాంశయందున్న చంద్రునికి చెప్పిన అనిష్టఫలము స్వల్పముగ జరుగును.

రాశిఫలం యద్దృష్టం పూర్వైః కథితం గ్రహై శ్శశాంకస్య,
తస్యనిరోధో దృష్టో యద్యంశపతి ర్బలీభవతి. 23

ఏనవాంశఫలము, రాశిఫలము పూర్వము చెప్పఁబడినవో, ఆఫలములు ఏనవాంశయందు చంద్రుఁడుండునో ఏరాశియందు చంద్రుఁడుండునో ఆనవాంశాధిపతి, రాశ్యధిపతి బలవంతులై యుండిరేని ఆరాశియందున్న, నవాంశయందున్న చంద్రునియొక్క దృష్టిఫలము నిరోధింపఁబడును.

అంశపతే శ్చంద్రస్యచ ఫలం వినిశ్చిత్య దర్శనకృతాని,
కథితాని యవనవృద్ధాః ఫలాని సమ్యగ్వ్యవస్యంతి. 24

చంద్రుఁడున్న నవాంశాధిపతియొక్కయు, చంద్రునియొక్కయు, రవ్యాది దృష్టికృతమైన ఫలమును యవనమతానుసారముగ నిశ్చయించి నాచే జెప్పఁబడినవి.

ఇతి చతుర్వింశోధ్యాయః.

## కుజచారమును దెలుపు ఇరువదియైదవ యధ్యాయము.

తేజస్వీ సత్యయుత శ్శూరః క్షితిపోఽథవా రణశ్లాఘీ,
సాహసకర్మాభిరత శ్చమూపురగ్రామబృందపతిః. 1
రాభసికోదానరతః ప్రభూతగోఽజావిధాన్యకరః,
భౌమే క్రియే ప్రచండో బహుయువతిరతో భవే త్పురుషః. 2

జననకాలమున కుజుఁడు మేషమందుండఁగాఁ బుట్టినవాఁడు తేజస్సు సత్యము శౌర్యము గ్రామాధిపత్యము మొదలైనవి గలవాఁడగును.

సాధ్వీవ్రతభంగకరః ప్రభాషణో మందధనపుత్రః,
ద్వేష్యో బహుభరణపరో విస్రంభస్థితివిహీనశ్చ. 3
ప్రోద్ధతవేషక్రీడో బహుదుష్టసహాః కుజే వృషభసంస్థే
సంగీతరతః పాపో బంధువిరుద్ధః కులోత్సాదీ 4

కుజుఁడు వృషభమందుండఁగాఁ బుట్టినవాఁడు పతివ్రతలయొక్క వ్రతభంగము సేయువాఁడు, మిక్కిలిమాటలాడువాఁడు, స్వల్పధనము పుత్త్రులు గలవాఁడు, ద్వేషాదిగుణయుక్తుఁ డగును.

కాంతాః క్లేశసహిష్ణు ర్బహుశ్రుతః కావ్యవిధినిపుణః,
నానాశిల్పకలాసు చ నిపుణో బహుశో విదేశగమనరతః. 5
ధర్మపరో నిపుణమతి ర్హితానుకూలః సుతేషు సుహృదాం చ,
మిథునస్థే క్షితిపుత్రే భవతి ప్రచురక్రియాసురతిః. 6

కుజుఁడు మిథునమందుండఁగాఁ బుట్టినవాఁడు స్త్రీప్రియుఁడు, క్లేశమును సహించువాఁడు, అనేకశాస్త్రములు మొదలైనవి దెలసినవాఁడగును.

పరగృహనివాసశీలో వైకల్యరుగర్దితః కృషిధనశ్చ,
బాల్యే చ రాజభోజనవస్త్రేప్సుః పరగృహాన్నాశీ. 7
సవిలాసయుతో ధనవాన్ పునఃపున ర్వృద్ధివేదనార్తశ్చ,
కర్కటకే క్షితితనయే భవతి మృదు స్సర్వతో దీనః. 8

కుజుఁడు కర్కటకమందుండఁగాఁ బుట్టినవాఁడు పరగృహవాసము దాసక్తి మొదలైనవి గలవాఁడగును.

అసహః ప్రచండశూరః పరస్వసంతానసంగ్రహణశీలః,
అటవీనివాసగోకులమాంసరుచి స్సాన్యస్మృతిప్రథమదారః. 9

వ్యాళమృగోరగహంతా నపుత్రవాన్ ధర్మఫలహీనః,
భౌమే హరౌ సుసత్వః క్రియోద్యతస్సాన్యద్వపుష్మాంశ్చ. 10

కుజుఁడు సింహమందుండఁగాఁ బుట్టినవాఁడు అసహనము శౌర్యము మొదలైనవి గలవాఁడగును.

పూజ్య స్సతా మతిధనో రతిగీతధనో మృదుప్రియాభాషీ,
వివిధవ్యయోఽల్పశౌర్యో విద్వాన్ భవతి ప్రణీతపార్శ్వశ్చ. 11

అహితేభ్యోఽర్జనభీరు ర్వేదస్మృతిధర్మవాన్ సుబహుశిల్పః,
కన్యాయాం భూతనయే స్నానవిలేపనరతః కాంతః. 12

కుజుఁడు కన్యయందుండఁగాఁ బుట్టినవాఁడు సత్పురుషులచే బూజింపఁబడువాఁడు, మిక్కిలిధనము మొదలైనవి గలవాఁడగును.

అధ్వనిరత స్సుపుణ్యః ప్రసక్తవాక్యో వికత్థన స్సుభగః,
హీనాంగ స్స్వల్పజన స్సంగ్రామేప్సుః పరోపభోగీచ. 13

యోషిద్గురుమిత్రాణాం మనోరమో నష్టపూర్వదారశ్చ,
శౌండకవేశ్యానికటే సంప్రాప్తధనక్షయ స్తులినిభౌమే. 14

కుజుఁడు తులయందుండఁగాఁ బుట్టినవాఁడు తిరుగుటయం దాసక్తిగలవాఁడు, పుణ్యశీలుఁడు, సౌందర్యము మొదలైనవి గలవాఁడగును.

వ్యాపారశ్రుతిసత్వ శ్చోరసమూహాధిపః క్రియానిపుణః,
యుద్ధోత్సుకోఽతిపాపో బహ్వపరాధీచ వైరకరః. 15

ద్రోహావధాహితబుద్ధిః ప్రసూచకో భూమిపుత్రయువతీశః,
వృశ్చికగే భూపుత్ర విషాగ్నిశస్త్రవ్రణై స్తప్తః. 16

కుజుఁడు వృశ్చికమందుండఁగాఁ బుట్టినవాఁడు వ్యాపారము వేదము సత్యము గలవాఁడు, చోరాధిపతి, కార్యనిపుణుఁడు, యుద్ధమం దాసక్తి మొదలైనవి గలవాఁడగును.

బహుభిః క్షతైః కృశాంగో నిష్ఠురవాక్యశ్శరః పరాధీనః,
రథగజపదాతియోధీ రథేనశరధారకోఽథపరసైన్యే. 17

విపులశ్రమైశ్చ సుఖతః పరస్పరం క్రోధనష్టసుఖవిత్తః,
కార్ముకసంస్థే వక్రే గురుష్వసక్తః పుమాన్ భవతి. 18

కుజుఁడు ధనుస్సుయందుండఁగాఁ బుట్టినవాఁడు అనేకగాయములచే కృశించిన శరీరము పరుషవాక్యములు మొదలైనవి గలవాఁడగును.

ధనో౽వి త్తాహర్తా సుఖభోగసమన్వితో భవతి సుస్థః,
శ్రేష్ఠమతిః ప్రఖ్యాత స్సేనానాథో నరేంద్రో వా. 19
సద్యః ప్రతిరణవిజయీ స్వబంధువిషయస్థిత స్స్వతంత్రశ్చ,
ఆరక్షక స్సుశీలః కుజే స్వతుంగే బహూపచారరతః. 20

కుజుఁడు మకరమందుండఁగాఁ బుట్టినవాఁడు సర్వజ్ఞుఁడు, ద్రవ్యార్జకుఁడు, సుఖము మొదలైనవి గలవాఁడగును.

ప్రశ్రయశౌచవిహీనో వృద్ధాకార స్సుదుర్గతి ర్మరణే,
మాత్సర్యాసూయానృతవాగ్దోషై రపహృతార్థశ్చ. 21
రోమశగాత్రో వికృతో ద్యూతాద్యాహృతధనః కువేషధరః,
దుఃఖసమాహృతవృత్తిః పానరుచి ర్దుర్భగః కుజే కుంభే. 22

కుజుఁడు కుంభమందుండఁగాఁ బుట్టినవాఁడు ఆచారవిహీనుఁడు, బడలినశరీరము మరణమందు దుర్గతి మొదలైనవి గలవాఁడగును.

రోగార్తో మందసుతః ప్రవాసశీల స్స్వబంధుపరిభూతః,
మాయావంచనదోషై ర్హృతసర్వస్వో విషాదీ చ. 23
జిహ్మోఽతితీక్ష్ణశోకో గురుద్విజావజ్ఞక స్సదాహీనః,
ఈప్సితవేత్తా జ్ఞాతా స్తుతిప్రియో౽న్త్యే కుజే ఖ్యాతః. 24

కుజుఁడు మీనమందుండఁగాఁ బుట్టినవాఁడు రోగపీడితుఁడు, స్వల్పపుత్రులు గలవాఁడు, విదేశమందుండువాఁడు, చక్కదనములేనివాఁడు, గొప్పశోకము మొదలైనవి గలవాఁడగును.

## స్వక్షేత్రగత కుజునియొక్క దృష్టిఫలము.

ధనదారపుత్రవంతం నృపసచివం దండనాయకం ఖ్యాతం,
నృపతి ముదారం కురుతే ధినేశ్వరనిరీక్షితః కుజస్వర్క్షే. 25

కుజుఁడు జననకాలమున స్వక్షేత్రమగు మేషవృశ్చికములయందుండి రవిచే జూడఁబడెనేని ధనము భార్య పుత్రులు మొదలైనవి గలవాఁడగును.

మాతృరహితం క్షతాంగం స్వజనద్వేష్యం చ మిత్రరహితం చ,

స్వగృహేఽస్య క్షశిదృష్టే స్సేర్ష్యం కన్యాప్రియం కురుతే. 26

కుజుఁడు స్వక్షేత్రమందుండి చంద్రునిచే జూడఁబడెనేని తల్లిలేనివాఁడు, అంగహీనుఁడు, కన్యలక్ష్మి ప్రియుఁడు అగును.

పరధనహారణే నిపుణం చానృతకం కామదేవభక్తం చ,
కురుతే స్వభేజ్ఞదృష్టో ద్వేష్యం వేశ్యాపతిం భౌమః. 27

కుజుఁడు స్వక్షేత్రమందుండి బుధునిచే జూడఁబడెనేని పరులధనహారణమందు నిపుణుఁడగును.

ప్రాజ్ఞం మధురం సుభగం మాతృపితృవల్లభం ధనసమృద్ధం,
అనుపమ మీశ్వర మాఢ్యం త్రిదశగురునిరీక్షితో ఽవనేః పుత్ర.

గురునిచే చూడఁబడెనేని ప్రాజ్ఞుఁడు, మధురవాక్యములను బలుకువాఁడు, సౌందర్యము గలవాఁడు అగును.

స్వగృహేఽస్య క్సితదృష్టే స్త్రీహేతో ర్బంధభాగినం కురుతే,
అసకృ త్సకృ చ్చ విభవం స్త్రీహేతో రార్జితం చాపి. 29

కుజుఁడు స్వక్షేత్రమందుండి శుక్రునిచే జూడఁబడెనేని స్త్రీమూలముగ బంధనము గలవాఁడు, స్వల్పవిభవము గలవాఁడు అగును.

చోరవిఘాతే శూరం నిర్వీర్యం స్వజనపరిహీనం,
అన్యస్త్రీభర్తారం జనయతి సౌరే క్షిత స్వభే భౌమః. 30

కుజుఁడు స్వక్షేత్రమందుండి శనిచే జూడఁబడెనేని చోరులను శిక్షించువాఁడు, వీర్యరహితుఁడు, అన్య స్త్రీలకు భర్త అగును.

### శుక్రక్షేత్రగత కుజునియొక్క దృష్టిఫలము.

వనపర్వతేషు రమతే రామాద్విష్టో భవే ద్బహువిపక్షః,
సితభే రవిణా దృష్టే ప్రచండకోపః కుజే ధీరః. 31
మాతురపత్యో విషమో బహుయువతీనాం పతిః ప్రియ స్తాసాం,
శుక్రగృహే శశిదృష్టే రణభీరు ర్జాయతే భౌమే. 32
కల్మహాప్రియో మృదువచా మృదుకాయో మంథపుత్రధనః,
సితభే భవతి చ భౌమే బుధదృష్టే శాస్త్రవిత్పురుషః. 33
వాదితగీతవిధిజ్ఞః సౌభాగ్యయుత స్సబంధుదయితశ్చ,
శుక్రభవనే క్షితిసుతే దృష్టే గురుణా భవేత్సుఖితః. 34
నృపమంత్రీ నృపదయిత స్సేనానాథః ప్రసిద్ధనామా చ,

శుక్రగృహే భవతి కుజే శుక్రేణ నిరీక్షితే సుఖితః. 35
సుఖభాక్ ఖ్యాతో ధనవా న్మిత్రస్వజనై ర్యుతః కుజే విద్వాన్,
శ్రేణిపురగ్రామాణా మధిప స్సితభే చ శనిదృష్టే. 36

కుజుఁడు శుక్రక్షేత్రమగు వృషభతులలయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని వనపర్వతాదులయందు సంచరించువాఁడు, స్త్రీలతో ద్వేషించువాఁడు, అనేకులతో ద్వేషించువాఁడు ఇట్టియుంటిగుణములు గలవాఁడగును.

బుధక్షేత్రమందున్న కుజునియొక్క దృష్టిఫలము.

విద్యాధనశౌర్యయుతం గిరివనదుర్గప్రియం మహాసత్వం,
బుధభవనే రక్తాంగో జనయతి దృష్ట స్సదారవినా. 37
కన్యాపురరక్షకరం యువతిపతిం సద్వినీత మతిసుభగం,
జ్ఞగృహే నృపగృహపాలం జనయతి చంద్రే క్షితో భౌమః. 38
లిపిగణితకావ్యకుశలం బహుభాషిణ మనృతమధురవాక్యం చ,
దూతం బహుదుఃఖనహం జనయతి వక్రో బుధేక్షితోఽజ్ఞర్క్షే. 39
రాజపురుషం ప్రకాశం దాత్యేన విదేశగం నరం కురుతే,
సర్వక్రియాసు కుశలం బుధరాశౌ నాయకం చ గురుదృష్టః. 40
శుక్రేణ దృశ్యమాన స్త్రీసకృత్యకరం సమృద్ధసుభగం చ,
బుధభవనే రక్తాంగః కురుతే వస్త్రాన్నభోక్తారం. 41
ఆకరగిరిదుర్గరతం కర్షక మతిదుఃఖభాగినం కురుతే,
అతిశూర మతిచ మలినం యమేక్షితో బుధగృహే విభవహీనం.

జననకాలమున కుజుఁడు బుధక్షేత్రమగు మిథునకన్యలయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని విద్య ధనము శౌర్యము మొదలైనవి గలవాఁడగును.

చంద్రక్షేత్రమందున్న కుజుని దృష్టిఫలము.

పిత్తరుగర్దితదేహ స్తేజస్వీ దండనాయకోధీరః,
చంద్రగృహస్థే భౌమే దినకరదృష్టే భవే త్పురుషః. 43
బహుభి ర్వ్యాధిభి రార్తో నీచాచారో విరూపదేహశ్చ,
శశిరాశౌ భూతనయే శశినాదృష్టే సశోక శ్చ. 44
మలినః పాపాచారః క్షుద్రకుటుంబో బహిష్కృత స్వజనైః,
కర్కటకే బుధదృష్టే క్షితితనయే భవతి నిర్లజ్జః. 45

విఖ్యాతో నృపమంత్రీ విద్యాం స్త్యాగాన్వితో భవే ద్ధన్యః,
గురుదృష్టే శశిభవనే భోగై శ్చ వివర్జితో వక్రే. 46
స్త్రీసంగా న్నష్టధనం పరిభూతస్త్రీకృతై స్తథాదోషైః,
కర్కటకే క్షితిపుత్రే సితదృష్టే స్యా ద్విపన్నధనః. 47
జలసంయానో విధనః క్షితిపాలసమానలలితచేష్టశ్చ,
శశిగృహసంస్థే భౌమే యమే క్షితే స్యా త్సదాకాంతః. 48

జననకాలమున కుజుఁడు చంద్రక్షేత్రమగు కర్కటకమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని పైత్యరోగపీడితదేహము మొదలైనవి గలవాఁడగును.

రవిక్షేత్రమందున్న కుజుని దృష్టిఫలము.

ప్రణతానాం హితకారీ మిత్రై స్స్వజనై శ్చ సంయుత శ్చండః,
గోకులవనాద్రిచారీ సింహే భౌమే తరణి దృష్టే. 49
మాతు ర్నశుభో మతిమాన్ కఠినశరీరో విపులకీర్తిః,
కేసరిభవనే భౌమే శశినాదృష్టేఽగనాప్తార్థః. 50
బహుశిల్పజ్ఞో లుబ్ధః కావ్యకలాలంపటో విషమశీలః,
పంచమభవనే భౌమే బుధేనదృష్టేఽతినిపుణ శ్చ. 51
భూపతిసమీపవర్తీ విద్యాచార్యో విశుద్ధబుద్ధి శ్చ,
అవనిసుతే సింహస్థే గురుణాదృష్టే చమూనాథః. 52
వివిధస్త్రీభోగయుత స్త్రీసుభగో నిత్యయావనో హృష్టః,
లేయగృహే రక్తాంగే సితేనదృష్టే భవే జ్జాతః. 53
వృద్ధాకారో నిస్వః పరవేశ్మభ్రమణశీలవాన్ దుఃఖీ,
దినకరరాశౌ రుధిరే దినకరతనయేన సందృష్టే. 54

జననకాలమున కుజుఁడు రవిక్షేత్రమగు సింహమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని నమ్రులైనవారిని రక్షించువాఁడు, మిత్రులు మొదలైనవి గలవాఁడగును.

గురుక్షేత్రమందున్న కుజదృష్టిఫలము.

లోకనమస్యం సుభగం వనగిరిదుర్గేషు లబ్ధగృహవాసం,
సురగురుభవనే భౌమః కరోతి రవిణేక్షితః క్రూరమ్. 55
వికలం కలహప్రాయం ప్రాజ్ఞం రుధిరః కరోతి శశిదృష్టః,
విద్వాంసం గురుభవనే నృపతివిరుద్ధం సదాపురుషమ్. 56

మేధావినం సునిపుణం శిల్పాచార్యం బుధేన సందృష్టః,
గురుభవనే క్షితితనయః కరోతి విద్వాంస మత్యంతమ్. 57
అకలత్రం సుఖరహితం రిపుభి రఘృష్యం చ విత్తవంతం చ,
గురుభవనే గురుదృష్టో వ్యాయామపరం కుజః కురుతే. 58
కన్యానా మతిదయితం చిత్రాలంకారభాగిన ముదారం,
విషయపర మధికసుభగం గురుభే కావ్యేక్షితః కుజః కురుతే. 59
గురుభేఽన్య కృనిదృష్టః కుశరీర ముదార మాహవే పాపం,
అటనం సుఖలవరహితం పరధర్మరతం కుజః కురుతే. 60

జననకాలమున కుజుఁడు గురుక్షేత్రములగు ధనుర్మీనములందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని జనులచే నమస్కరించఁదగినవాఁడు, సౌందర్యము మొదలైనవి గలవాఁడగును.

శనిక్షేత్రస్థిత కుజదృష్టిఫలము.

అతికృష్ణతనుం శూరం యోషి దపత్యార్థవిస్తరై ర్యుక్తం,
సూర్యేక్షితోఽతితీక్ష్ణ స్సౌరగృహే భూమిజః కురుతే. 61
చపలమహితం జనన్యా యమభేఽలంకారభాగిన ముదారం,
అస్థిరసౌహృద మాఢ్యం జనయతి చంద్రేక్షితో వక్రః. 62
అతిమధురగసనమధనం రవితనయగృహేన నిర్వృతమసత్వం,
కాపటిక మధర్మపరం జనయతి బుధవీక్షితో భౌమః. 63
అవిరూపం మందగృహే నృపతిగుణసమన్వితం స్థిరారంభం,
దీర్ఘాయుషం క్షమాజో గురుసందృష్టః కరోతి బంధ్వాప్తమ్. 64
వివిధోపభోగమాఢ్యం శనిభే స్త్రీపోషణానురతమేవ,
శుక్రేణ దృశ్యమానో జనయతి కలహప్రియం వక్రః. 65
నృపతి మతివిత్తవంతం యువతిద్వేష్యం బహుప్రజం ప్రాజ్ఞం,
సుఖరహితం రణశౌండం కరోతి శనిభే శనీక్షితో భౌమః. 66

జననకాలమున కుజుఁడు శనిక్షేత్రమగు మకరకుంభములయందుండి, రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని ఆరవ్యాదిగ్రహములకు చెప్పిన మిక్కిలి నల్లనిశరీరము మొదలగునవి గలవాఁడగును.

ఇతి పంచవింశోఽధ్యాయః.

## బుధచారమును దెలుపు ఇగునదియాఱన యధ్యాయము.

ప్రియవిగ్రహస్తు వేత్తాచార్యో వితథార్థచేష్టకృశగాత్రః,
సంగీతనృత్తనిరతో నసత్యవచనో రతిప్రియో లిపివిత్ 1
కూటకరో బహ్వాశీ బహుశ్రమోత్పన్ననష్టధనః,
బహ్వృణబంధనభాగీ చలస్థిరస్స్యా త్క్రియే బుధే కితవః. 2

జనన కాలమున బుధుఁడు మేషమందుండెనేని సౌందర్యము గలవాఁడు, విద్వాంసుఁడు, స్త్రీసంభోగాతిశయముచే కృశించిన శరీరముగలవాఁడు, సంగీతశాస్త్రజ్ఞుఁడు, అసత్యమాడువాఁడు, రతియం దాసక్తి మొదలైనవి గలవాఁడగును.

దక్షః ప్రగల్భదాతా ఖ్యాతో విజ్ఞాతవేదశాస్త్రార్థః,
వ్యాయామాంబరభూషణమాల్యాభిరతః స్థిరప్రకృతిః. 3
స్ఫీతధనస్త్రీసహితః ప్రియవల్గుకథో గృహీతవాక్యశ్చ,
గాంధర్వహాస్యశీలో రతిలోలో వై బుధే వృషభే. 4

బుధుఁడు వృషభమందుండఁగాఁ బుట్టినవాఁడు సమర్థుఁడు, గొప్పదాత, ఖ్యాతి మొదలైనవి గలవాఁడగును.

శుభవేషః ప్రియభాషీ ప్రఖ్యాతధనో వికత్థనో మానీ,
ప్రోజ్ఝితసుఖకోఽల్పరతి ర్ద్విస్త్రీపుత్రో వివాదరతః. 5
శ్రుతికల్పకలాభిజ్ఞః కవిస్స్వతంత్రః ప్రియః ప్రదానరతః,
కర్మఠబహుసుతమిత్రో నరమిథునస్థే బుధే భవతి. 6

బుధుఁడు మిథునమందుండఁగాఁ బుట్టినవాఁడు మంగళవేషముగలవాఁడు, ప్రియముగ బలుకువాఁడు, గొప్పధనము మొదలైనవి గలవాఁడగును.

ప్రాజ్ఞో విదేశనిరత స్త్రీస్వరతిగేయాదిసక్తవిత్తశ్చ,
చపలో బహుప్రలాపీ స్వబంధువిద్వేషవాదరతః. 7
స్త్రీవైరా న్నష్టధనః కుత్సితశీలో బహుక్రియాభిరతః,
సుకవిః కర్కటసంస్థే స్వవంశకీర్త్యా ప్రసిద్ధశ్చ. 8

బుధుఁడు కర్కటకమందుండఁగాఁ బుట్టినవాఁడు ప్రాజ్ఞుఁడు, విదేశమం దాసక్తి మొదలైనవి గలవాఁడగును.

జ్ఞానకలాపరిహీనో లోకఖ్యాతో నసత్యవాక్యశ్చ,
అల్పస్మృతి శ్చ ధనవా న్సత్త్వవిహీన స్సహాజహంతా, 9

స్త్రీదుర్భగ స్స్వతంత్రో జఘన్యకర్మాబుధే భవతి పురుషః,
ప్రేష్యోఽప్రజస్తు సింహే స్వకులవిరుద్ధో జనాభిరామ శ్చ. 10

బుధుఁడు సింహమందుండఁగాఁ బుట్టినవాఁడు అజ్ఞాని, లోకమందు ఖ్యాతి సత్యము మొదలైనవి గలవాఁడగును.

ధర్మ ప్రియోఽతివాగ్మీ చతురస్స్యా ల్లేఖ్యకావ్యజ్ఞః,
విజ్ఞానశిల్పనిరతో మధుర స్త్రీప్వల్పవీర్య శ్చ. 11
జ్యేషః పూజ్య స్సుహృదాం నానావినయోపచారదారరతః,
ఖ్యాతో గుణై రుదారః కన్యాయాం సోమజే బలవాన్. 12

బుధుఁడు కన్యయందుండఁగాఁ బుట్టినవాఁడు ధర్మమం దాసక్తి వక్తృత్వము చాతుర్యము మొదలైనవి గలవాఁడగును.

శిల్పవివాదాభిరతో వాక్చతురో ఽర్థ మీప్సితవ్యయకృత్,
నానాదిక్పణ్యరతి ర్విప్రాతిథిదేవగురుభక్తః. 13
కృతకోపచారకుశల స్సుసమ్మతో దేవభక్త శ్చ,
సప్తమభవనే శశిజే శఠశ్చలత్రీ ప్రకోపపరితోషః. 14

బుధుఁడు తులయందుండఁగాఁ బుట్టినవాఁడు శిల్పాసక్తి వివాదాసక్తి వాక్చాతుర్యము మొదలైనవి గలవాఁడగును.

శ్రమశోకానర్థపర స్సద్వేష్యోఽత్యంతధర్మలజ్జ శ్చ,
మూర్ఖో నసాధుశీలో లుబ్ధో దుష్టాంగనారమణః. 15
పారుష్యదంభనిరత శ్చలకృ ద్విద్విష్టకర్మనునిరుద్ధః,
ఋణవా న్నీచానురుచిః పరవస్వాదానవాన్కీటే. 16

బుధుఁడు వృశ్చికమందుండఁగాఁ బుట్టినవాఁడు శ్రమ మొదలైనవి గలవాఁడగును.

విఖ్యాతోఽదారగుణ శ్శాస్త్రశ్రుతిశౌర్యశీలసమధిగతః,
మంత్రిపురోహితో వా కులప్రధానో మహావిభవః. 17
యజ్ఞాధ్యాపననిరతో మేధావీ వాక్పటుర్వ్రతీ దాతా,
లిపిలేఖ్యదాననిరతః కార్ముకసంస్థే బుధే జాతః. 18

బుధుఁడు ధనుస్సుయందుండఁగాఁ బుట్టినవాఁడు ఖ్యాతి ఉదారగుణములు మొదలైనవి గలవాఁడగును.

నీచో మూర్ఖ షండః పరకర్మకరః కులాదిగుణహీనః,
నానాదుఃఖపరీత స్స్వప్నవిహారాదిశీల శ్చ. 19

పిశున స్తవ్యసత్యచేష్టో బంధువిముక్తో౽త్యసంస్థితాత్మా చ,
మలినోభయసంచలితో దిష్టో మకరే బుధే పురుషః. 20

బుధుఁడు మకరమందుండఁగాఁ బుట్టినవాఁడు నీచుఁడు, మూర్ఖుఁడు, నపుంసకుఁడు, పరకార్యాసక్తి మొదలైనవి గలవాఁడగును.

వాగ్బుద్ధికర్మనిరతః ప్రకీర్ణధర్మార్థవర్గవిహితార్థః,
పరపరిభూతో నశుచి శ్శీలవిహీన స్తథా౽జ్ఞశ్చ. 21
అతిదుష్టదారశత్రు ర్భోగై స్త్యక్తో ఘటే విచావాగ్భవతి,
అతిదుర్భగో౽తిభీరుః క్లీబో మలినో విధేయ శ్చ. 22

బుధుఁడు కుంభమందుండఁగాఁ బుట్టినవాఁడు వాక్కులయందు బుద్ధియందు సత్కర్మలయందు ఆసక్తి మొదలైనవి గలవాఁడగును.

ఆచారశౌచనిరతో దేశాంతరగో౽ప్రజో దరిద్ర శ్చ,
శుభయువతిః కృతిసాధు స్సుతాంచ సుభగో విధర్మరతః. 23
సూచ్యాదికర్మకుశలో విజ్ఞానశ్రుతికలావియుక్త శ్చ,
పరధనసంచయదక్షో మీనే శశిజే౽ధనః ప్రకీర్ణ శ్చ. 24

బుధుఁడు మీనమందుండఁగాఁ బుట్టినవాఁడు ఆచారము శౌచము మొదలైనవి గలవాఁడగును.

## కుజక్షేత్రమందు బుధదృష్టిఫలము.

సత్యవచనం సుఖాఢ్యం భూపతిసత్కారసత్కృతం మనుజం,
కురుతే బుధో౽ర్కదృష్టో బంధుజనే సుక్షమం కుజభే. 25
రజనీకరేణదృష్టో యువతిజనమనోహరం క్షితిజరాశౌ,
అతిసేవక మతిమలినం చంద్రసుతో హీనశీలం చ. 26
అనృతప్రియం సువాక్యం కలహసమేతం చ పండితం కుజభే,
జనయతి కుజేనదృష్టిః ప్రచురధనం క్షితిపవల్లభం శూరమ్ః 27
సుఖినం శశిభే శశిజ స్స్నిగ్ధాంగం రోమశం సుకేశంచ,
జీవేక్షితో౽తిధనినం జనయ త్యజ్ఞాపకం పాపమ్. 28
నృపకృత్యకరం సుభగం గణనపరపురోగమం చతురవాక్యం,
ప్రత్యయినం సతదృష్టః కుజభే స్త్రీసంయుతం శశిజః. 29
రుధిరగృహే శనిదృష్టో హిమకిరణసుతో౽తిదుఃఖితం జనయేత్,
ఉగ్రం హింసాభిరతం కులజనహీనం నరం నిత్యమ్. 30

జననకాలమున బుధుఁడు కుజక్షేత్రములగు మేషవృశ్చికములందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని సత్యమును బలుకువాఁడు, సుఖముగలవాఁడు, స్త్రీలను సంతోషపెట్టువాఁడు, అనృతమం దాసక్తి మొదలైనవి గలవాఁడగును.

## శుక్రక్షేత్రమందున్న బుధదృష్టిఫలము.

దారిద్ర్యదుఃఖత ప్తం వ్యాధితదేహం పరోపచారరతం,
దినకరదృష్ట స్సౌమ్యః కురుతే జనధిక్కృతం సితభే. 31
ప్రత్యయితం ధనవంతం దృఢభక్తి మరోగిణం దృఢకుటుంబం,
ఖ్యాతం నరేంద్రసచివం జ్ఞశ్చంద్రనిరీక్షిత స్సితభే. 32
వ్యాధిభి రరిభిర్గ్ర స్తం క్లిష్టం భూపావమానసంతప్తం,
జనయతి విదసృగ్దృష్టో బహిష్కృతం సర్వవిషయేభ్యః. 33
ప్రాజ్ఞం గృహీతవాక్యం దేశపురశ్రేణినాయకం ఖ్యాతం,
త్రిదశగురుదృష్టమూర్తి ర్జనయతి సౌమ్య స్సితగృహస్థః. 34
సుభగం లలితం సుఖినః వస్త్రాలంకారభోగినం సితభే,
హృదయహారం కన్యానాం కురుతే శుక్రే క్షితస్సౌమ్యః. 35
శుక్రగృహే౽ర్కజదృష్ట స్సుఖరహితం బంధుశోకసంక్లిష్టం,
వ్యాధితమనర్థబహుళం సౌమ్యః కురుతే నరం మలినమ్. 36

బుధుఁడు శుక్రక్షేత్రములగు వృషభతులలయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని ఆయాఫలములు గలవాఁడగును.

## స్వక్షేత్రమందున్న బుధదృష్టిఫలము.

అవితథకథనం మధురం నృపవల్లభ మీశ్వరం లలితచేష్టం,
దయితం కరోతి లోకే రవిణాదృష్టో బుధ స్స్వగృహే. 37
సుమధుర మతివాచాటం కలహరతం శాస్త్రవత్సలం సుదృఢం,
జనయతి శశినాదృష్టో బుధ శ్శుభం సర్వకార్యేషు. 38
విక్షతగాత్రం మలినం ప్రతిభాయుక్తం నరేంద్రభృత్యంచ,
వల్లభ మతీవ కురుతే స్వగృహే రుధిరేణ సందృష్టః. 39
పార్థివమంత్రిణ మగ్ర్యం ప్రతిరూప ముదారవిభవపరివారం,
యూపధ్వజేనదృష్టో జనయతి శూరం స్వభే సౌమ్యః. 40
ప్రాజ్ఞం నరేంద్రభృత్యం ధూతంవా సంధిపాలకం శశిజః,
స్వగృహే సితేనదృష్టో జనయతి నీచాంగనాసక్తమ్. 41

నతత్రోత్థితం వినీతం సఫలారంభం పరిచ్ఛదసమృద్ధం,
సౌమ్య స్స్వగృహే దృష్టో రవిజేన నరం సదాకురుతే. 42

జననకాలమున బుధుఁడు స్వక్షేత్రమగు మిథునకన్యలయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని ఆయాగుణములు గలవాఁడగును.

కర్కటమందున్న బుధదృష్టిఫలము.

రజకం మాలాకారం గ్రహవాస్తుజ్ఞం తథాచ మణికారం,
జనయతి రవిణాదృష్టో బుధోగృహం శిశిరగోశ్చ గతః. 43
యువతివినాశితసారం యువతినిమిత్తం చ దుఃఖితశరీరం,
కర్కటకే శశిదృష్టో జనయతి సుఖవర్జితం సౌమ్యః. 44
స్వల్పశ్రుత మతిముఖరం ప్రియానృతం కూటకారిణం చోరం,
వక్రే క్షిత శ్శశిగృహే కురుతే సౌమ్యః ప్రజాపాలమ్. 45
మేధావిన మతిదయితం భాగ్యయుతం వల్లభం నరేంద్రాణాం,
గురుణాదృష్ట శ్శశిభే విద్యానాం పారగం బుధః కురుతే. 46
కందర్పసదృశరూపం ప్రియంవదం గీతవాదనవిధిజ్ఞం,
సుభగం శశిభే లలితం కురుతే శుక్రేక్షిత స్సౌమ్యః. 47
దంభరుచిం పాపరతం బంధనభాజం గుణై ర్వియుక్తం జ్ఞః,
ద్వేషం సహజాచార్యైః కురుతే సౌరేక్షిత శ్శశిభే. 48

జననకాలమున బుధుఁడు చంద్రక్షేత్రమగు కర్కటకమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని ఆయాగుణయుక్తుఁ డగును.

సింహమందున్న బుధదృష్టిఫలము.

సేవ్యం దినకరదృష్టో ధనగుణవృద్ధం నరం బుధః కురుతే,
హింస్రం క్షుద్రం సింహే చంచలభాగ్యం విగతలజ్జమ్. 49
రూపాన్విత మతిచతురం కావ్యకలాగేయనృత్తరతిమినభే,
ధనినం సుశీలవేషం కురుతే చంద్రేక్షిత స్సౌమ్యః. 50
జ్ఞో నీచం రవిభవనే దుఃఖార్తం విక్షతాంగసమరూపం,
అచతుర లీలాకాంతం నపుంసకం భౌమసందృష్టః. 51
సుకుమార మతిప్రాజ్ఞం రవిభే వాగీశ్వరం త్వతిఖ్యాతం,
పరిచారవాహనయుతం కురుతే గురువీక్షిత స్సౌమ్యః. 52

అతిశయరూపం లలితం ప్రియంవదం వాహనాఢ్య మతిధీరం,
జనయతి సితేనదృష్టో మంత్రిణ మథ పార్థివం సింహే. 53
వ్యాయతగాత్రం రూక్షం సువిరూపం స్వేదనో గ్రగంధంచ,
అతిదుఃఖితం రవిగృహే జనయతి సుఖవర్జితం రవిజదృష్టః. 54

జననకాలమున బుధుఁడు రవిక్షేత్రమగు సింహమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని ఆయాగుణములు గలవాఁడగును.

## గురుక్షేత్రమందున్న గురుదృష్టిఫలము.

శూరం ప్రమేహపీడిత మక్ష్యరోగ్యోపహతమాతురం శాంతం,
జనయతి రవిణాదృష్టో జీవగృహే చంద్రజః పురుషమ్. 55
లేఖక మతిసుకుమారం ప్రత్యయితం సంమతం గురుగృహస్థః,
సుఖభాగిన మత్యాఢ్యం కురుతే చంద్రేక్షిత స్సౌమ్యః. 56
శ్రేణీభృతినగరాణాం చోరాణాం విపినవాసినాం చాపి,
కురుతే లిపికర మధిపం సౌమ్యో గురుమందిరే రుధిరదృష్టః. 57
స్మృతిమతికులసంపన్నం గురుభే ప్రతిరూప మార్యవిజ్ఞానం,
నృపమంత్రకోశపాలం లిపికరమిహ వీక్షితో గురుణా. 58
కన్యాకుమారకాణాం లేఖ్యాచార్యం ధనాన్వితం కురుతే,
గురుభే భృగుసుతదృష్ట స్సుకుమారం శౌర్యసంయుతం శశిజః. 59
దుర్గారణ్యాభిరతం బహ్వాశనం దుష్టశీల మతిమలినం,
కురుతే రవిసుతదృష్టో బుధో నరం సర్వకార్యవిభ్రష్టమ్. 60

జననకాలమున బుధుఁడు గురుక్షేత్రములగు ధనుర్మీనములయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని శౌర్యాది గుణయుక్తుఁడగును.

## శనిక్షేత్రమందున్న బుధదృష్టిఫలము.

మల్లమతిసారయుక్తం బహుభృత్యం నిష్ఠురం ప్రియాలాపం,
జనయతి రవిభాదృష్ట స్సౌరగృహే బోధనః ఖ్యాతమ్. 61
జలజీవినం సమృద్ధం పుష్పసురాకందవణిజంవా,
భీరుస్వరూప మచరం శనిభే చంద్రేక్షితః కురుతే. 62
వాక్చపల మతిసుసౌమ్యం వ్రీడాలసమంథరం సుఖాధారం,
కురుతే భూసుతదృష్టో రవితనయగృహే బుధః పురుషమ్. 63

బహుధనధాన్యసమృద్ధం గ్రామపుర శ్రేణిపూజితం సుఖినం,
కురుతే గురుణాదృష్ట స్సౌరగృహే బోధనః ఖ్యాతమ్. 64
నీచాపతిం విరూపం బుద్ధివిహీనం చ కామవశ్యంచ,
అతిసుతజననం కురుతే భార్గవదృష్టో బుధశ్శనిభే. 65
పాపకరం సుదరిద్రం కర్మకరం చాతిదుఃఖితం దీనం,
కురుతే శనినాదృష్ట స్సౌరగృహే బోధనః పురుషమ్. 66

బుధుఁడు శనిక్షేత్రములగు మకరకుంభములయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని మల్లయుద్ధము సేయువాఁడు, బలము మొదలైనవి గలవాఁడగును.

ఇతి షడ్వింశోధ్యాయః.

---

## గురుచారమును దెలుపు ఇరువదియేడవ యధ్యాయము.

వాదిగుణై స్సంపన్నః ప్రయత్నరత్నాభరణసంసర్గః,
సత్వాత్మజార్థబలయు క్ప్రగల్భవిఖ్యాతకర్తాచ. 1
ఓజస్వీ బహుశత్రు ర్బహువ్యయార్థః క్షతాంకితశరీరః,
చండోగ్రదండనాథో జీవే క్రియగే భవే త్పురుషః. 2

జననకాలమున గురుఁడు మేషమందుండెనేని రత్నములు ఆభరణములు మొదలైనవి గలవాఁడై బలము శత్రువులు గలవాఁడగును.

పీనో విశాలదేహ స్సురద్విజగవాంచ భక్తిమార్గ కాంతః,
సుభగ స్స్వదారనిరత స్సువేషకృషిగోధనాఢ్యశ్చ. 3
సద్వస్త్రభూషణయుతో విశిష్టవాఙ్మతిగుణో న యజ్ఞ శ్చ,
వృషభే గురౌ వినీతో భిషక్ప్రయోగాప్తకౌశలకః. 4

గురువు వృషభమందుండఁగాఁ బుట్టినవాఁడు బలసినవాఁడు, విశాలదేహము దేవబ్రాహ్మణభక్తి సౌందర్యము మొదలైనవి గలవాఁడగును.

ఆహితధన స్సుమేధాః విజ్ఞానవిశారద స్సునయన శ్చ,
వాగ్మీ దాక్షిణ్యయుతో నిపుణ స్సాన్య ద్ధర్మశీల శ్చ. 5
మాన్యో గురుబంధూనాం మండనమాంగల్యలబ్ధవరశబ్దః,
మిథునస్థే దేవగురౌ క్రియారతి స్సత్కవిశ్చైవ. 6

గురువు మిథునమందుండఁగాఁ బుట్టినవాఁడు ధనికుఁడు, ధారణసమర్థమైన బుద్ధి మొదలైనవి గలవాఁడగును.

విద్వాన్ సురూపదేహః ప్రాజ్ఞః ప్రియధర్మసత్త్వభావశ్చ,
సుమహాత్కులో యశస్వీ ప్రభూతధాన్యాకరధనేశః. 7
సత్యసమాధిసుయుక్త స్థిరాత్మజో లోకసత్కృతః ఖ్యాతః,
నృపతి ర్జీవే శశిభే విశిష్టకర్మాసుహృజ్జనానురతః. 8

గురువు కర్కాటకమందుండఁగాఁ బుట్టినవాఁడు విద్వాంసుఁడు, సౌందర్యమైన దేహముగలవాఁడు, ప్రాజ్ఞుఁడు, యోగ్యస్వభావము మొదలైన సుగుణములు గలవాఁడగును.

దృఢవైరసత్త్వధీర స్సుబహుస్నేహ స్సుహృజ్జనే విద్వాన్,
ఆఢ్య శ్శిష్టాభిజనో నృపో నృపతిపౌరుష స్సభాలక్ష్యః. 9
త్రిదశగురౌ సింహస్థే సమస్తరోషోద్ధృతారిపక్షశ్చ,
సుదృఢవ్యస్తశరీరో గిరిదుర్గవనాలయే జాతః. 10

గురువు సింహమందుండఁగాఁ బుట్టినవాఁడు విరోధము బలము ధైర్యము మొదలైనవి గలవాఁడగును.

మేధావీ ధర్మపరః క్రియాపటు ర్ధర్మవా న్యువతిరాశౌ,
ప్రియగంధపుష్పవస్త్రః కృత్యేషు వినిశ్చితార్థశ్చ. 11
శాస్త్రార్థశిల్పకార్యై ర్ధనవా న్దాతా విశుద్ధశీలశ్చ,
స్యా ద్దేవగురౌ నిపుణ శ్చిత్రాక్షరవి ద్ధనసమృద్ధశ్చ. 12

గురువు కన్యయందుండఁగాఁ బుట్టినవాఁడు ధారణసమర్థమైన బుద్ధి ధర్మాసక్తి కార్యమందు పటుత్వము గంధపుష్పములయం దాసక్తి మొదలైనవి గలవాఁడగును.

మేధావీ బహుపుత్రో విదేశచర్యాగతః ప్రభూతధనః,
భాషా ప్రియోఽవినీతో నటనర్తకసంగృహీతధనః. 13
కాంత శ్స్మితాభినిరతో మహత్తరసార్థవాహవణిజాం హి,
వణిజేంద్రమంత్రిణి గతే సురాతిథీజ్యారతః ప్రాజ్ఞః. 14

గురువు తులయందుండఁగాఁ బుట్టినవాఁడు ధారణసమర్థమైన బుద్ధిగలవాఁడు, అనేకపుత్రులు మొదలైనవి గలవాఁడగును.

బహుశాస్త్రాణాం కుశలో నృపతి ర్బహుభాష్యకారకో నిపుణః,
దేవాలయపురకర్తా సద్బహుదారోఽల్పపుత్రశ్చ. 15
వ్యాధ్యార్తశ్రమబహులః ప్రసక్తదోషో గురౌ భవత్యలిని,
దంభేన ధర్మనిరతో జుగుప్సితాచారనిరతశ్చ. 16

గురువు వృశ్చికమందుండఁగాఁబుట్టినవాఁడు అనేకశాస్త్రములయందు నేర్పు గలవాఁడు, రాజు, అనేకభాష్యములను సేయువాఁడు, నిపుణుఁడు, దేవాలయములను గ్రామములను అధిపతి, అనేకభార్యలు గలవాఁడు, స్వల్పపుత్రులు గలవాఁడు, వ్యాధిచే పీడితుఁడు, దంభముచే ధర్మము సేయువాఁడు అగును.

ఆచార్యో వ్రతదీక్షా యజ్ఞాదీనాం స్థిరార్థశ్చ,
దాతా సుహృత్స్వపక్షః ప్రియోపకారశ్చ్యుతాభిరతః. 17
మాండలికో మంత్రీ వా ధనుర్ధరస్థే భవే త్సదాజీవే,
నానాదేశనివాసీ వివిక్తతీర్థాయతనబంధుః. 18

గురువు ధనుస్సునందుండఁగాఁ బుట్టినవాఁడు పూజ్యుఁడు, దానము సేయువాఁడు, యజ్ఞాదులయందు స్థిరద్రవ్యముగలవాఁడు, మండలాధిపతి లేక మంత్రియగును.

లఘువీర్యో మకరస్థే బహుశ్రమక్లేశధారకో జీవే,
నానాచారో మూర్ఖో దురంతనిస్స్వః పరప్రేష్యః. 19
మాంగల్యదయాశౌచస్వబంధువాత్సల్యధర్మపరిహీనః,
దుర్బలదేహో భీరుః ప్రవాసశీలో విషాదీచ. 20

గురువు మకరమందుండఁగాఁ బుట్టినవాఁడు స్వల్పబలము శ్రమకోర్చువాఁడు, అనేకాచారములు దెలిసినవాఁడు, మూర్ఖుఁడు, గొప్పదరిద్రము ననుభవించువాఁడు, పరప్రేష్యుఁడు, దయ ఆచారము మొదలైనవి లేనివాఁడు అగును.

పిశునో నసాధుశీలః కుశిల్పతోయాశ్రమేషు కర్మరతః,
ముఖ్యోగణస్య సుతరాం నీచాభిరతో నృశంసశ్చ. 21
లుబ్ధో వ్యాధిగ్రస్త స్స్వవాక్యదోషేణ నాశితార్థశ్చ,
ప్రజ్ఞాదిగుణైర్హీనో ఘటేగురౌ స్యాద్గురుస్త్రీగః. 22

గురువు కుంభమందుండఁగాఁ బుట్టినవాఁడు బలిసినవాఁడు, సాధుస్వభావము మొదలైనవి గలవాఁడగును.

వేదార్థశాస్త్రవేత్తా సుహృదాం పూజ్య స్సతాం చ నృపనేతా,
శ్లాఘ్య స్సుధనోఽధృష్యోఽహ్యాహీనదర్పస్థిరారంభః. 23
రాజ్ఞ స్సునీతశిక్షా వ్యవహారరణప్రయోగవేత్తా చ,
ఖ్యాతః ప్రశాంతచేష్టో స్థిరసత్వయుత శ్చ మీనగేజీవే. 24

గురువు మీనమందుండఁగాఁ బుట్టినవాఁడు వేదము వేదార్థము మొదలైనవి దెలిసినవాఁడు, స్నేహితులలో పూజ్యుఁడు, రాజులకు అధిపతి, కొనియాడఁదగినవాఁడు, ధనికుఁడు, వ్యవహారమందు రణమందు నేర్పుగలవాఁడు అగును.

## కుజక్షేత్రమందున్న గురుదృష్టిఫలము.

ధర్మిష్ఠ మనృతభీరుం విఖ్యాతసుతం మహాభాగ్యం,
భౌమగృహే రవిదృష్టో హ్యాతిరోమచితం గురుః కురుతే. 25
ఇతిహాసకావ్యకుశలం బహురత్నం స్త్రీషు భాజనం కురుతే,
కుజగేహే శశిదృష్ట స్త్రిదశగురుః పార్థివం ప్రాజ్ఞమ్. 26
నృపపురుషశూరముగ్రం నయవినయసమన్వితం చ విధనం చ,
అవిధేయిభృత్యదారం జనయతి వక్రే క్షితో జీవః. 27
అనృతం వంచనపాపం పరవినరాన్వేషణేషు నిపుణం చ,
సేవావినయకృతజ్ఞం కాపటికం సౌమ్యసందృష్టః. 28
గృహాశయనవసనగంధై ర్మాల్యాలంకారయువతిభి ర్విభవైః,
సముచిత మతీవ భీరుం కురుతే వక్రేక్షితో జీవః. 29
మలినం లుబ్ధం తీక్ష్ణం సాహసికం సంమతం చ సిద్ధం చ,
అస్థిరమిత్రాపత్యం త్రిదశగురు స్సౌరసందృష్టః. 30

జననకాలమున బృహస్పతి కుజక్షేత్రములగు మేషవృశ్చికములందుండి రవ్యాది గ్రహములచే చూడఁబడెనేని ధార్మికుఁడు, అనృతమందు భయము మొదలైనవి గలవాఁడగును. రవ్యాదిగ్రహము లనఁగా: రవి చంద్ర కుజ బుధ శుక్ర శనులకు క్రముగా ఒక్కొక్క శ్లోక ముండుటచేతను సుగమములైన ఫలములగుటచేతను తాత్పర్య సంగ్రహము వ్రాయఁబడినది. ఇట్లే రవ్యాది శనన్యంతచారములయందు తెలియఁదగినది. రవిచారమందు రవి చూడఁబడెడువాఁడుగాన చంద్రాది ఆఱుగ్రహములకు దృష్టిఫలములు జెప్పఁబడినవి. ఇట్లే అన్నిగ్రహములకు తెలియవలెను.

## శుక్రక్షేత్రమందున్న గురుదృష్టిఫలము.

ద్విపదచతుష్పదభాగిన మత్యటనం వ్యాయతాంగ మిహపురుషం,
ప్రాజ్ఞం నరేంద్రసచివం కరోతి సూర్యేక్షితో జీవః. 31
అతిధన మతీవ మధురం జననీదయితం ప్రియంచయువతీనాం,
అత్యుపభోగం కురుతే చంద్రేణ నిరీక్షితో జీవః. 32
దయితం బాలస్త్రీణాం ప్రాజ్ఞం శూరం చ ధనసమృద్ధం చ,
సుఖినం నరేంద్రపురుషం భృగుభే జీవో రుధిరదృష్టః. 33
ప్రాజ్ఞం చతురం మధురం సుధనం విభవాన్వితం గుణసమృద్ధం,
సురుచిరశీలం కాంతం జనయతి బుధవీక్షితో జీవః. 34

అతిలలితమతిం ధనినం పరభూషణధారిణం మృజాశీలం,
వరశయనం వరవసనం భృగుభే భృగువీక్షితో జీవః. 35
ప్రాజ్ఞం బహుధనధాన్యం మహత్తరం గ్రామనగరపురుషాణాం,
నలిన మరూప మభార్యం కురుతే సౌరేక్షితో జీవః. 36

జననకాలమున గురువు శుక్రక్షేత్రములగు వృషభతులలయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని భృత్యులు పశువులు మొదలైనవి గలవాఁడగును.

## బుధక్షేత్రమందున్న గురుదృష్టిఫలము.

ఆర్యం గ్రామశ్రేష్ఠం కుటుంబినం దారపుత్రధనయుక్తం,
బుధభే దినకరదృష్ట స్త్రిదశగురు స్థానవం కురుతే. 37
చంద్రేక్షిత స్తు కురుతే వసుమంతం మాతృవల్లభం ధన్యం,
సుఖయువతిపుత్రవంతం సురగురురతిరూప మనుపమం బుధభే. 38
శాశ్వతసులబ్ధవిషయం చిత్రితగాత్రం ధనాన్వితం కురుతే,
ధరణిసుతేక్షితదేహ స్త్రిదశగురుస్సమ్మతం లోకే. 39
కురుతే జ్యోతిషకుశలం బహుసుతదారం చ సూత్రకారంచ,
అతిశయవిరూపవాక్యం బుధభే సౌమ్యేక్షితో జీవః 40
దేవప్రాసాదానాం కృత్యకరం వేశదారభోక్తారం,
హృదయహరం నారీణాం కురుతే శుక్రేక్షితో జీవః. 41
శ్రేణీగణరాష్ట్రాణాం పురోగమం గ్రామపత్తనానాం చ,
జనయతి శనినాదృష్ట స్సుతనుం జీవో నరం బుధభే. 42

జననకాలమున గురువు బుధక్షేత్రములగు మిథునకన్యలయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని పూజ్యుఁడు, గ్రామాధిపతి, భార్య పుత్రులు మొదలైనవి గలవాఁడగును.

## కర్కాటకమందున్న గురుదృష్టిఫలము.

రవిదృష్ట శ్శశిభవనే విఖ్యాతం హ్యగ్రహం సమూహానాం,
సుఖధనదారవిహీనం పశ్చాదాఢ్యం గురుః కురుతే. 43
అత్యర్థం ద్యుతిమంతం నృపతిం బహుకోశవాహనసమృద్ధం,
ఉత్తమయువతీపుత్రం జనయే చ్ఛశిభే గురు ర్హిమగుదృష్టః. 44
కౌమారదార మాఢ్యం హేమాలంకారభాగినం ప్రాజ్ఞం,
శూరం సవ్రణగాత్రం రుధిరాంగనిరీక్షితో గురుః కురుతే. 45

బాంధవమాత్రనిమిత్తం ధనినం కలహాన్వితం విగతపాపం,
జనయతి బుధేనదృష్టః ప్రత్యయినం మంత్రిణాం జీవః. 46
బహుదారం బహువిభవం నానాలంకారభాగినం సుఖినం,
భృగుతనయదృష్టమూర్తి స్సుభగం పురుషం గురుః కురుతే. 47
సౌరేణ దృష్టమూర్తి ర్మహత్తరం గ్రామసైన్యనగరాణాం,
వాచాటం బహువిభవం వార్ధక్యే భోగభాగినం జీవః. 48

జననకాలమున గురువు కర్కటకమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని ఖ్యాతి మొదలైనవి గలవాఁడగును.

## సింహమందున్న గురుదృష్టిఫలము.

సింహే దయితం ఖ్యాతం సతాం చ నృపతిం మహాధనసమృద్ధం,
జనయతి దినకరదృష్ట స్త్రిదశగురు స్సురమతిసుశీలమ్ 49
అతిసుభగ మధికమలినం స్త్రీభాగ్యై రుపచితార్థ మత్యాఢ్యం,
లేయేచంద్రసుదృష్టో జితేంద్రియం జనయతి సురేజ్యః. 50
సత్యం సతాం గురూణాం విశిష్టకర్మాణ ముగ్ర మతినిపుణం,
శుద్ధం శూరం క్రూరం గురురిహ భౌమేక్షిత స్సింహే. 51
గృహవాస్తుజ్ఞానరతం విజ్ఞానగుణాన్వితం రుచిరవాక్యం,
సింహే మంత్రిణ మగ్ర్యం బుధేక్షితో విశ్రుతం జీవః. 52
దయితం స్త్రీణాం సుభగం భూపతిసత్కారసత్కృతం పురుషం,
సితదృష్ట స్సురపూజ్యో జనయతి సింహే మహాసత్వమ్. 53
బహుకథనమధురవచనం సుఖరహితం చిత్రభాగినం తీక్ష్ణం,
అమరస్త్రీతుల్యసుఖం సింహగురు స్సౌరసందృష్టః. 54

జననకాలమున గురువు సింహమునందుండి రవ్యాదిగ్రహములచే చూడఁబడెనేని దయ ఖ్యాతి ధనము మొదలైనవి గలవాఁడగును.

## స్వక్షేత్రమందున్న గురుదృష్టిఫలము.

నృపతివిరుద్ధం జనయతి విబుధగురు స్సంస్థిత స్స్వగృహే,
రవిదృష్టః పరితప్తం ధనబంధుజనేన పరియుక్తమ్. 55
నానావిధసౌఖ్యయుతం స్వగృహే చంద్రేక్షితో జీవః,
అతిసుభగం యువతీనాం మానధనైశ్వర్యగర్వితం కురుతే. 56

సంగ్రామే వికృతాంగం క్రూరం వధకం పరోపకారపరం,
జనయతి కుజేన దృష్టో దేవగురు ర్నష్టపరివారమ్. 57
మంత్రిణ మథ నృపతిం వా సుతధన సౌభాగ్య సౌఖ్యసంపన్నం,
స్వగృహే బుధేనదృష్ట స్సకలానందం గురుఃకురుతే. 58
సుఖినం ధనినం ప్రాజ్ఞం వ్యపగతదోషం చిరాయుషం సుభగం,
స్వగృహే సితేన దృష్టో లక్ష్మీపరివేష్టితం గురుఃపురుషమ్. 59
మలినమతీవచ సుభగం గ్రామపురశ్రేణిధిక్కృతం దీనం,
స్వగృహాగురు శ్శశిదృష్టో జనయతి సుఖభోగధర్మపరిహీనమ్. 60

జననకాలమున గురువు స్వక్షేత్రములగు ధనుర్మీనములయందుండి రవ్యాది గ్రహములచే జూడఁబడెనేని ప్రభువువిరోధి, ధనముచేతను బంధువులచేతను తపించువాఁడు, అనేకసౌఖ్యములు మొదలైనవి గలవాఁడగును.

శనిక్షేత్రమందున్న గురుదృష్టిఫలము.

ప్రాజ్ఞం పృథివీపాలం సౌరగృహే భానునాచ సందృష్టః,
ప్రకృతిసమృద్ధం జనయతి బహుభోగసమన్వితం సువిక్రాంతమ్. 61
పితృమాతృభక్తమార్యం కులోద్భవం ప్రాజ్ఞ మాఢ్య మాదేయం,
చంద్రేక్షితస్తు జీవ స్సుశీల మతిధార్మికం శనిభే. 62
శూరం నరేంద్రయోధం గర్విత మోజస్వినం సువేషం చ,
విఖ్యాత మార్యమాన్యం శనిభే వక్రేక్షితో జీవః. 63
కామమతిం గణముఖ్యం మానవ మథ సార్థవాహ మాఢ్యంవా,
ఖ్యాత మతిమిత్రవంతం బుధసందృష్టో గురు శ్శనిభే. 64
భోజ్యాన్నపానవిభవం వరగృహశయనాసనోత్తమస్త్రీకం,
ఆభరణవసన మంతం శనిభే శుక్రేక్షితో జీవః. 65
అనుపమవిద్యావృత్తం మహత్తరం దేశపార్థివం శనిభే,
ద్విపదచతుష్పద మాఢ్యం భోగిన మథ సౌరవీక్షితో జీవః. 66

జననకాలమున గురువు శనిక్షేత్రములగు మకరకుంభములయందుండి రవ్యాది గ్రహములచే జూడఁబడెనేని ప్రాజ్ఞుఁడు, భూపాలన మొదలైనవి గలవాఁడగును. రవి జూచెనేని ప్రథమశ్లోకఫలములు. చంద్రుఁడు జూచెనేని రెండవశ్లోకఫలములు అని ఇట్లె అన్నిగ్రహములకు తెలియఁదగినది

ఇతి సప్తవింశోధ్యాయః.

## శుక్రచారమును దెలుపు ఇరువదియొనిమిదవ యధ్యాయము.

నైశాంధో బహుదోషో విరోధశీలః పరాంగనాచోరః,
వేశ్యావనాద్రిచారీ స్త్రీహేతో ర్బంధనం ప్రాప్తః. 1
క్షుద్రః కఠోరచోర శ్చమూపురశ్రేణిబృందనాథశ్చ,
మేషే స్యా ద్భృగుతనయే నోవిశ్వాసీ ప్రగల్భ శ్చ. 2

జననకాలమున శుక్రుఁడు మేషమందుండిన రేజీఁకటిగలవాఁడు, అనేకదోషములుఁ గలవాఁడు, విరోధస్వభావము గలవాఁడు, పరస్త్రీ నపహరించువాఁడు, వేశ్యలతో వనములయందు పర్వతములయందు దిరుగువాఁడు, ఇటువంటి ఫలములు గలవాఁడగును.

బహుయువతిరత్నసహితః కృషీవలో గంధమాల్యవస్త్రయుతః,
గోకులజీవీదాతా స్వబంధుభర్తా సుమూర్తి శ్చ. 3
ఆఢ్య స్త్వనేకవిద్యో బహుప్రద స్సత్వహితకారీ,
వృషభే గుణైః ప్రధానః పరోపకారీ సితే భవతి జాతః. 4

శుక్రుఁడు వృషభమందుండఁగాఁ బుట్టినవాఁడు అనేకభార్యలు గలవాఁడు, వ్యవసాయము సేయువాఁడు, సుగంధద్రవ్యములయం దాసక్తి గలవాఁడు ఇటువంటి గుణయుక్తుఁ డగును.

విజ్ఞానకలాశాస్త్రః ప్రథిత స్సతతం సుమూర్తిగః కామీ,
ఆలేఖ్యలేఖ్యనిరతః కావ్యకర స్స్యా త్ప్రియ స్సాధుః. 5
ధృతగీతనృత్తవిభవ స్సుహృజ్జనాఢ్య స్సురద్విజానురతః,
సంరూఢస్నేహో వై మిథునస్థే భార్గవే భవతి. 6

శుక్రుఁడు మిథునమందుండఁగాఁ బుట్టినవాఁడు శాస్త్రజ్ఞుఁడు, ప్రసిద్ధుఁడు, కాముకుఁడు, లేఖకుఁడు, ప్రియుఁడు, నృత్తగీతాదులచే కూర్చినధనము మొదలైనవి గలవాఁడగును.

రతిధర్మరతః ప్రాజ్ఞో బలీమృదుస్గుణవతాం ప్రధాన శ్చ,
ఆకాంక్షితై స్సుఖార్థై ర్యుక్తః ప్రియదర్శన స్సునీతి శ్చ. 7
యోషిత్పానప్రభవై ర్వ్యాధిభి రధికం ప్రపీడితో మనుజః,
శుక్రే కర్కటసంస్థే స్వపంశభవదోషసంతప్తః. 8

శుక్రుఁడు కర్కటమందుండఁగాఁ బుట్టినవాఁడు కళాశాస్త్రజ్ఞుఁడు, ప్రాజ్ఞుఁడు, గుణశ్రేష్ఠుఁడు, సుఖము ధనము నీతి మొదలైనవి గలవాఁడగును.

యువతిజనోపాసనయా లబ్ధసుఖద్రవిణసంప్రమోద శ్చ,
లఘుసత్వప్రియబంధు ర్విచిత్రసౌఖ్య శ్చ దుఃఖీ చ. 9
ఉపకారీ చ పరేషాం గురుద్విజాచార్యసంమతో నిరతః,
సింహస్థే భృగుతనయే బహుచింతాస్వనభియోగస్స్యాత్. 10

శుక్రుఁడు సింహమందుండఁగాఁ బుట్టినవాఁడు స్త్రీలమూలముగ పొందఁబడిన ధనముగలవాఁడు, స్వల్పబలము గలవాఁడు, బంధుప్రియుఁడు, విచిత్రమైన సౌఖ్యములు దుఃఖములు మొదలైనవి గలవాఁడగును.

లఘుచింతో మృదునిపుణః పరోపసేవీ కలావిధిజ్ఞ శ్చ,
స్త్రీసంభాషణమధురః ప్రణయనగణనార్థకృతయత్నః. 11
నారీషు దుష్టరతిషు ప్రణయీ దీనో నసౌఖ్యభోగయుతః,
కన్యాయాం భృగుతనయే తీర్థసభాపండితో జాతః. 12

తా. శుక్రుఁడు కన్యయందుండఁగాఁ బుట్టినవాఁడు స్వల్పఆలోచన, మృదుకార్యములయందు నైపుణ్యము, పరోపకారము మొదలైనవి గలవాఁడై శాస్త్రజ్ఞుఁడగును.

శ్రమలబ్ధవిత్తశూరో విచిత్రమాల్యాంబరో విదేశరతః,
నైపుణరక్షణకుశలః కర్మసు చపల స్సుదుష్కరేషు తథా. 13
ఆఢ్యో గుచిరనుపుణ్యో ద్విజదేవార్చనవిలబ్ధకీర్తి శ్చ,
శుక్రే తులాధరగతే భవతి పుమా న్పండిత స్సుభగః. 14

శుక్రుఁడు తులయందుండఁగాఁ బుట్టినవాఁడు స్వార్జితధనముగలవాఁడు, నిపుణుఁడు, విదేశమందుండువాఁడు,రక్షణసేయువాఁడు, దేవబ్రాహ్మణభక్తి మొదలైనవి గలవాఁడగును.

విద్వేషరతిన్నృశంసో విముక్తధర్మావికత్థనోఽతిశఠః,
సహజవికారో ధన్యో విపన్నశత్రు స్తథాపాపః. 15
ఆర్యః కుటా ద్వేషీ వధనిపుణో బహ్వృణో దరిద్ర శ్చ,
అలిని సితే భవతి పుమాన్ గర్హితశీల స్సుగర్హ్యరోగదః. 16

శుక్రుఁడు వృశ్చికమందుండఁగాఁ బుట్టినవాఁడు ద్వేషించువాఁడు, హింసించువాఁడు, అధర్ముఁడు, పిచ్చివాఁడు ఇట్టిగుణయుక్తుఁడగును.

సద్ధర్మకర్మధనజైః ఫలై రుపేతో జగత్ప్రియః కాంతః,
ఆర్యః కులబ్ధశబ్దో విద్వా న్గోమా నలంకరిష్ణు శ్చ. 17

సద్వృత్తదారసుభగో నరేంద్రసంత్రీ సుచతురోఽపీ,
పీనోచ్చ తనుః పూజ్య స్సతాం సమూహస్య ధనుషికవౌ. 18

శుక్రుఁడు ధనుస్సునందుండఁగాఁ బుట్టినవాఁడు సద్ధర్మముచేతను, సత్కర్మల చేతను, సద్ధనముచేతను ఆర్జితపుణ్యఫలము గలవాఁడు, జనప్రియుఁడు, సౌందర్యము గలవాఁడు, కులశ్రేష్ఠుఁడు, విద్వాంసుఁడు, యోగ్యమైన ధనముచేతను భార్యచేతను సౌందర్యము గలవాఁడు అగును.

వ్యయభయపరిసంతప్తో దుర్బలదేహో జరాంగనాసక్తః,
హృద్రోగీ ధనలుబ్ధో లోభానృతవంచనో నిపుణః. 19
క్లీబో విపన్నచేష్టః పరార్థచేష్ట స్సుదుఃఖితో మూఢః,
మకరే దానవపూజ్యే క్లేశసహో జాయతే పురుషః. 20

శుక్రుఁడు మకరమందుండఁగాఁ బుట్టినవాఁడు ద్రవ్యవ్యయము చేతను భయము చేతను తపించువాఁడు, దుర్బలదేహము హృదయరోగము మొదలైనవి గలవాఁడగును.

ఉద్వేగరోగత ప్తః కర్మసు విఫలేషు సర్వదాభిరతః,
పరయువతిగోవిధర్మా గురుభిః పుత్రైశ్చ కృతవైరః. 21
స్నానోపభోగభూషణవస్త్రాదినిరాకృతో మలినః,
కుంభధరే భృగుపుత్రే భవతి పుమాన్మాత్రసందేహః. 22

శుక్రుఁడు కుంభమందుండఁగాఁ బుట్టినవాఁడు గొప్పరోగముచేతపించువాఁడు, విఫలకర్మలయం దాసక్తిగలవాఁడు, పరస్త్రీరతుఁడు, ధర్మశూన్యుఁడు, గురువులతోడను పుత్రులతోడను ద్వేషించువాఁడు అగును.

దాక్షిణ్యదానగుణవా న్మహాధనోధఃకృతారిపక్ష శ్చ,
లోకే ఖ్యాత శ్శ్రేష్ఠో విశిష్టచేష్టో నృపతిదయితః. 23
వాగ్బుద్ధియుతో దార స్సుజనపరిలబ్ధవిభవమాన శ్చ,
స్వాదేయవచామీనే వంశధరో జ్ఞానవాన్ శుక్రే. 24

జననకాలమున శుక్రుఁడు మీనమందుండఁగాఁ బుట్టినవాఁడు దాక్షిణ్యాది గుణయుక్తుఁడగును.

## కుజక్షేత్రమందున్న శుక్రదృష్టిఫలము.

స్త్రీహేతో ర్దుఃఖా ర్తం యువతినిమిత్తా ద్వినష్టధనసౌఖ్యం,
కుజభవనే రవిదృష్టో జనయతి శుక్రో నృపం ప్రాజ్ఞమ్. 25
ఉద్బంధన మతిచపలం కామాతుర మధమయువతిభర్తారం,

జనయతి భృగో రపత్యం రజనీకరవీక్షితం కుజభే. 26
ధనసౌఖ్యమానరహితం పరకర్మకరం మలినచేష్టం,
జనయతి రుధిరక్షేత్రే రుధిరేణ నిరీక్షిత శ్శుక్రః. 27
మూర్ఖం ధృష్ట మనార్యం స్వబంధుపరివాదకం వినయహీనం,
చోరం క్షుద్రం క్రూరం బుధదృష్టో భార్గవః కురుతే. 28
సునయన ముదారదానం సుశరీరం వ్యాయతం బహుసుతం చ,
త్రిదశగురుదృష్టమూర్తి ర్జనయతి రుధిరాలయే శుక్రః. 29
అతిమలిన మలస మటన స్వభిమతజనసేవకం కురుతే,
భృగుతనయో రుధిరగృహే దినకరపుత్రేణ వీక్షిత శ్శౌరమ్. 30

శుక్రుఁడు జననకాలమున కుజక్షేత్రములగు మేషవృశ్చికములయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని స్త్రీమూలముగ దుఃఖము, అసౌఖ్యము మొదలైనవి గలవాఁడగును. ఒక్కొక్క గ్రహమునకు ఒక్కొకశ్లోక ముండుటవల్లను అనఁగా: ప్రథమశ్లోకము సూర్యునిచే జూడఁబడిన ఫలములను దెలుపును. రెండవశ్లోకము చంద్రదృష్టిఫలమును దెలుపును మూఁడవశ్లోకము కుజదృష్టిఫలమును దెలుపును. నాల్గవశ్లోకము బుధదృష్టిఫలమును దెలుపును. ఐదవశ్లోకము గురుదృష్టిఫలమును దెలుపును. ఆఱవశ్లోకము శనిదృష్టిఫలమును దెలుపును, ఇట్లె అన్నిదృష్టిఫలముల నూహింపవలెను.

## స్వక్షేత్రమందున్న శుక్రదృష్టిఫలము.

దినకరదృష్ట శ్శుక్రో వరజాయాభోగినం ధనసమృద్ధం,
జనయ త్యుత్తమపురుషం స్త్రీహేతో ర్నిర్జితం స్వగృహే. 31
పరమకులీనాపుత్రం సుఖధనదానై స్సుఖై రుపేతం చ,
అత్యార్యమతిం కాంతం స్వగృహే చంద్రేక్షిత శ్శుక్రః. 32
దుశ్శీలాభర్తారం ప్రమదాహేతో శ్చ నష్టగృహదారం,
జనయతి భృగునందకరో యువనవశం వక్రసందృష్టః. 33
కాంతం మధురం సుభగం సుఖధృతి మతిసంయుతం విపులసత్వం,
జనయతి బుధేనదృష్ట స్సర్వగుణసమన్వితం ఖ్యాతమ్. 34
ప్రమదాపుత్రగృహాణాం భాగిన మథ యానవాహనానాం చ,
సక్షే గురుసందృష్టః కురుతే భృగురిష్టచేష్టానాం. 35
స్వల్పసుఖం స్వల్పధనం దుశ్శీలం వర్ధకీపతిం చైవ,
సౌరేక్షితస్తు జనయే ద్వ్యాధితదేహం నరం శుక్రః. 36

శుక్రుఁడు స్వక్షేత్రములగు వృషభతులలయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడఁగాఁ బుట్టినవాఁడు ఆయాఫలములు గలవాఁడగును.

## బుధక్షేత్రమందున్న శుక్రదృష్టిఫలము.

నృపజననీపత్నీనాం కృత్యకరం పండితం ధనినం,
దినకరదృష్ట శ్శుక్రో జనయతి సుఖభాగినం బుధభే. 37
కృష్ణనయనం సుకేశం శయనాసనయానభాగినం కాంతం,
సుకుమార మిందుదృష్టో జనయతి శుక్రో నరం సుభగమ్. 38
కామపరమతిచ సుభగం యువతికృతే చార్థనాశనం కురుతే,
వక్రేక్షిత స్తు శుక్రో బుధభవన ముపాశ్రితః ప్రసవే. 39
ప్రాజ్ఞం మధురం ధనినం వాహనపరివారభాగినం శుభగం,
గణపతి మర్థేశంవా బుధదృష్టో భార్గవో బుధభే. 40
బుధభవనగత శ్శుక్ర స్త్రిదశగురునిరీక్షితః కురుతే,
అతిసుఖ మతీవ దీనం ప్రతిరూపకరం జ్ఞ మాచార్యం. 41
దినకరసుతేనదృష్టో బుధభవనగతో ఽతిదుఃఖినం శుక్రః,
జనయతి ఖలు పరిభూతం చపలం ద్వేష్యం చ మూర్ఖం చ. 42

జననకాలమున శుక్రుఁడు బుధక్షేత్రములగు మిథునకన్యలయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని ప్రభువుకు తల్లికి భార్యకు లోఁబడువాఁడు, పండితుఁడు, ధనము మొదలైనవి గలవాఁడగును.

## చంద్రక్షేత్రమందున్న శుక్రదృష్టిఫలము.

కర్మపరాం శుద్ధాంగీం నృపతిసుతాం రోషణాం ధనోపేతాం,
భార్యాం దదాతి శుక్ర శ్చంద్రగృహే భానుసందృష్టః. 43
మాతృసపత్నీజననం కన్యాపూర్వప్రజం బహుసుతం చ,
సుఖినం సుభగం లలితం కురుతే చంద్రేక్షిత శ్శుక్రః. 44
సుకలావిద మత్యాఢ్యం స్త్రీహేతో ర్దుఃఖితం సుభగం,
భౌమేక్షితస్తు జనయే ద్వృద్ధికరం బంధువర్గస్య. 45
పండితభార్యాపతికం బంధునిమిత్తం చ దుఃఖితం నిత్యం,
అతిసుఖ ధనినం ప్రాజ్ఞం కరోతిశశిభే బుధేక్షిత శ్శుక్రః. 46
భృత్యై ర్ధనై శ్చ పుత్రై ర్వాహనభోగై శ్చ బాంధవై ర్మిత్రైః,
కురుతే నర మిహాయుక్తం నరపతిదయితం చ గురుదృష్టః. 47

స్త్రీనిర్జితం దరిద్రం పతిత మసురూపం తథైవ చపలం చ,
జనయతి సుఖై ర్విహీనం శశిభే శనివీక్షిత శ్శుక్రః. 48

జననకాలమున శుక్రుఁడు చంద్రక్షేత్రమగు కర్కటకమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని సత్కార్యాసక్తి మొదలైనవి గలభార్య మొదలైనవి గలవాఁడగును.

## రవిక్షేత్రమందున్న శుక్రదృష్టిఫలము.

సేర్ష్యం కన్యాదయితం కామార్తం యువతికారణం ధనినం,
భోగిన మథ కరభాణాం జనయతి సింహే రవీక్షిత శ్శుక్రః. 49
మాతృసపత్నీ జననం యువతికృతే దుఃఖితం విభవంతం,
సింహేనానామతికం కరోతి చంద్రేక్షిత శ్శుక్రః. 50
నృపపురుషం విఖ్యాతం యువతిక్తృతే వల్లభం ధనసమృద్ధం,
సుభగం పరదారరతం సింహే వక్రేక్షిత శ్శుక్రః. 51
సంగ్రహనిరతం లుబ్ధం స్త్రీలోలం పారదారికం శూరం,
శఠ మానృతికం ధనినం సింహే బుధవీక్షిత శ్శుక్రః. 52
వాహనధనభృత్యయుతం బహుదారపరిగ్రహం రవిక్షేత్రే,
కురుతే నరేంద్రమంత్రిణ మింద్రగురునిరీక్షిత శ్శుక్రః. 53
నృపతిం నృపతిప్రతిమం విఖ్యాతం కోశవాహనసమృద్ధం,
రండాపతిం సురూపం దుఃఖయుతం సౌరసందృష్టః. 54

జననకాలమున రవిక్షేత్రమగు సింహమందు శుక్రుఁడుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని ఈర్ష్యతో కూడినవాఁడు, కన్యలకు ప్రియుఁడు, మన్మథపీడితుఁడు ఇత్యాదిగుణములు గలవాఁడగును.

## గురుక్షేత్రమందున్న శుక్రదృష్టిఫలము.

అతిరౌద్ర మతిచశూరం గురుభే ప్రాజ్ఞంచ ధనిన మతిదయితం,
రవిణాదృష్టో జనయతి విదేశగమనం నరం శుక్రః. 55
ఖ్యాతం నరేంద్రపురుషం భోగై రశ్వై స్సమన్వితం విపులైః,
కురుతే హ్యానుపమసారం గురుభే చంద్రేక్షిత శ్శుక్రః. 56
అధ్వికద్వేష్యం స్త్రీణాం విచిత్రసుఖదుఃఖ మర్థవంతం చ,
కుర్తుతే గోధన మగ్ర్యం గురుభే భౌమేక్షిత శ్శుక్రః. 57

ఆభరణభూషణానాం భాగినమపి చాన్నపానానాం,
బుధదృష్టో భృగుతనయః కురుతే గురుభేఽర్థవాహనసమృద్ధమ్. 58
గజతురగగోధనాఢ్యః బహుపుత్రకళత్ర మతిసుఖినం,
గురుణాదృష్టో గురుభే జనయతి శుక్రో మహావిభవమ్. 59
నిత్యం చ ధనప్రాయం సుఖినం భోగాన్వితం ధనసమృద్ధం,
గురుభవనే శనిదృష్టః కురుతే శుక్రో నరం సుభగమ్. 60

జననకాలమున శుక్రుఁడు గురుక్షేత్రములగు ధనుర్మీనములయందుండి రవ్యాది గ్రహములచే జూడఁబడెనేని కోపము శూరత్వము మొదలైనవి గలవాఁడగును.

## శనిక్షేత్రమందున్న శుక్రదృష్టిఫలము.

స్తిమితం వృషభం స్త్రీణాం మహాధనం సత్యసౌఖ్యసంపన్నం,
సౌరగృహే రవిదృష్టః కురుతే శుక్రో నరం శూరమ్. 61
ఓజస్విన మతిశూరం స్వాఢ్యం వపుషాన్వితం సుభగం,
కురుతే శశినాదృష్టో రవిజగృహే భార్గవః కాంతమ్. 62
జాయావినాశకారణ మనర్థబహుళం చ రోగిణం శుక్రః,
కురుతే శ్రమాభితప్తం పశ్చాత్సుఖినం చ కుజదృష్టః. 63
ప్రాజ్ఞం ధనచయనిరతం నిధానరుచి మతిశయేన విద్వాంసం,
జనయతి బుధేనదృష్టో భృగుతనయ స్సత్యసౌఖ్యసంపన్నమ్. 64
ప్రియవస్త్రమాల్యగంధం సుకుమారం గీతవాదితవిధిజ్ఞం,
జనయతి గురుణాదృష్టో భృగుపుత్ర స్సత్కళత్రయుతమ్. 65
సౌరగృహే శనిదృష్ట శ్శుక్రో నరవాహనార్థభోగయుతం,
మలినం శ్యామశరీరం సురుచిరగాత్రం మహాదేహమ్. 66

జననకాలమున శుక్రుఁడు శనిక్షేత్రమగు మకరకుంభములయందుండి రవ్యాది గ్రహములచే జూడఁబడెనేని స్తిమితాదిగుణయుక్తుఁ డగును.

ఇత్యష్టావింశోఽధ్యాయః.

---

## శనిచారమును దెలుపు ఇరువదితొమ్మిదవ యధ్యాయము.

వ్యసనపరిశ్రమతప్తః ప్రచండశీల స్స్వబంధుపక్షశ్చ,
నిష్ఠురధృష్టాతివచా విగర్హితో నిర్ధనః కువేషశ్చ. 1

మేషేఽర్కజో సువేషో జఘన్యకర్తా చ లబ్ధదోషోఽపి,
ప్రియవైరో నైకృతికో నృశంసకో నూయకః పాపః. 2

జననకాలమున శని మేషమందుండఁగా దుఃఖముచే తపించువాఁడు, కఠినవాక్కులు మనుష్యులను హింసించుట మొదలగు పాపగుణయుక్తుఁడగును.

అర్థవిహీనః ప్రేష్యో నయుక్తవాక్యో నసత్యకర్తా చ,
వృద్ధస్త్రీహృదయహరః కుసుహృత్ స్త్రీవ్యసనసంసక్తః. 3
సౌరే వృషభం యాతే భవతి చ జాతః పరాంగనాప్రేష్యః,
నైకృతిక స్స్ఫుటదృష్టో బహుక్రియాసంగతో మూఢః. 4

శని వృషభమందుండఁగాఁ బుట్టినవాఁడు నిర్ధనుఁడు, ప్రేషకుఁడు, అబద్ధము బలుకువాఁడు, వృద్ధస్త్రీరతుఁడు ఇట్టిగుణములు గలవాఁడగును.

బహ్వృణబంధనతప్త శ్శ్రీమాన్వితో డాంబికోఽనుమంత్రీ చ,
శాఠ్యగుణై స్సంత్యక్త స్సదైవ గుహ్యాళ్చ కామశీలశ్చ. 5
ఛలకృ చ్చ మన్యుదృష్టః క్రియాతిశాయీ శఠః కులీనశ్చ,
బంధనవిహారసక్తో బాహ్యక్రీడానుగో మిథునే. 6

శని మిథునమందుండెనేని అనేకఋణములు మొదలైనవానిచే తపించువాఁడగును.

సుభగాన్వితో దరిద్రో బాల్యే రోగాతిపీడితః ప్రాజ్ఞః,
జననీరహితోఽతిమృదు ర్విశిష్టనిరత స్సదాతురశ్చాపి. 7
పరబాధకో విశిష్టో బంధువిరుద్ధో విలోమశీలశ్చ,
మధ్యే భూపతితుల్యః పరిభోగవివర్ధిత శ్శశిభే. 8

శని కర్కటకమందుండఁగాఁ బుట్టినవాఁడు సౌందర్యము దరిద్రము బాల్యమందు రోగము మొదలైనవి గలవాఁడగును.

లిపిపాఠ్యపరోఽభిజ్ఞో విగర్హితో విగతశీలశ్చ,
స్త్రీవియుతో భృతిజీవీ స్వపక్షరహితో ముదాహీనః. 9
నీచక్రియాసు నిరతో వివృద్ధరోషో మనోరథై ర్భ్రాంతః,
భారాధ్వశ్రమదుఃఖైః ప్రకీర్ణదేహో యమే సింహే. 10

శని సింహమందుండెనేని వ్రాయుటయందు చదువుటయందు నేర్పుగలవాఁడు, శాస్త్రజ్ఞుఁడు, నీచకార్యములయం దాసక్తి మొదలైనవి గలవాఁడగును.

షండాకారోఽతిశఠః పరాన్నవేశ్యారతోఽల్పమంత్రశ్చ,

శిల్పకథాస్వనభిజ్ఞో నికృత్యచేష్టో లసత్సుతార్థశ్చ. 11
అధనః పరోపకారీ కన్యాజనదూషకః క్రియానురతః,
కన్యాయాం రవితనయే హ్యవేశ్యకారీ పుమాన్ జాతః. 12

శని కన్యయందుండెనేని నపుంసకాకారముగలవాఁడు, పరాన్నమందు వేశ్యల యందు ఆసక్తిగలవాఁడు, యోగ్యమైన సంతానద్రవ్యములు మొదలైనవి గలవాఁడగును.

అర్థపరశ్చారువచా నరో విదేశాటనాప్తమానధనః,
నృపతి స్సుబోధనో వా స్వపక్షగుప్తస్థిరార్థస్స్యాత్. 13
బృందసభానాం జ్యేష్ఠో వయఃప్రకర్షా త్కృతాస్పద స్సాధుః,
కులటానటీవిటస్త్రీరమణో రవిజే తులాయాం తే. 14

శని తులయందుండఁగాఁ బుట్టినవాఁడు ద్రవ్యాసక్తి గలవాఁడు, సౌష్ఠవముగ మాటలాడువాఁడు, విదేశము దిరుగుటచే పొందఁబడినమానము ధనము గలవాఁడు, ప్రభువు, కులటానటీస్త్రీలను భోగించువాఁడు అగును.

ద్వేషపరో విషమోవా విషశస్త్రఘ్నః ప్రచండకోపశ్చ,
లుబ్ధో దృప్తోఽర్థయుతః పరస్వహరణే సమర్థశ్చ. 15
బాహ్యో మంగళవాద్యై ర్నృశంసకర్మా హ్యనేకదుఃఖస్స్యాత్,
అష్టమరాశౌ రవిజే క్షయవ్యయవ్యాధిభి స్తప్తః. 16

శని వృశ్చికమందుండఁగాఁ బుట్టినవాఁడు ద్వేషించువాఁడు, విషమస్వభావము కోపము మొదలైన పాపకర్మాసక్తి గలవాఁడగును.

వ్యవహారబోధ్యశిష్టో శ్రుతార్థవిద్యాభిధానుకూలమతిః,
పుత్రగుణై ర్విఖ్యాత స్స్వధర్మవృత్తై శ్చ శీలై శ్చ. 17
అంత్యే వయసి చ లక్ష్మీం భునక్తి పరమాం ప్రలబ్ధమానస్తు,
అల్పవచా బహుసంజ్ఞో మృదుర్యమే కార్ముకస్థే స్యాత్. 18

శని ధనుస్సుయందుండఁగాఁ బుట్టినవాఁడు వ్యవహారము మొదలైనవానియందు నైపుణ్యబుద్ధిగలవాఁడు, పుత్రులగుణములచే ఖ్యాతినొందువాఁడు, అంత్యవయసునందు ధనము మొదలైనవి గలవాఁడగును.

పరయోషి త్క్షేత్రాణాం ప్రభుశ్శ్రుతిగుణై ర్యుతశ్చ బహుశిల్పః,
శ్లేష్మశ్చ వంశజాతైః పూజ్యః పరబృందసత్కృతః ఖ్యాతః. 19
స్నానవిభూషణనిరతః క్రియాకలాజ్ఞః ప్రవాసశీలశ్చ,
కోణే మృగభే జాతః ప్రజాతశౌర్యోపచారస్స్యాత్. 20

శని మకరమందుండఁగాఁ బుట్టినవాఁడు పరస్త్రీలకు పరక్షేత్రములకు అధిపతి యగును. వేదమార్గమందు వర్తించువాఁడు, శిల్పవిద్య నెఱింగినవాఁడు, వంశమందు శ్రేష్ఠుఁడు, పూజ్యుఁడు, స్నానము మొదలైనవానియం దాసక్తిమొదలైనవి గలవాఁడగును.

బహ్వనృత స్సుమహాన్ స్యా న్మద్యస్త్రీవ్యసనసంప్రసక్తశ్చ,
ధూర్తకవంచనకుశలః కుసౌహృదో హ్యతిదృఢశ్చండః. 21
జ్ఞానకథాస్మృతిబాహ్యః పరాంగనార్థ స్సుకర్కశాభాషీ,
రవితనయే కుంభస్థే బహుక్రియారంభకృతయత్నః. 22

శని కుంభమందుండఁగాఁ బుట్టినవాఁడు అబద్ధమాడువాఁడు, గొప్పవాఁడు, మద్యమందు స్త్రీలయందు ఆసక్తిగలవాఁడు, ధూర్తులను వంచించువాఁడు, కుత్సితస్నేహితులు గలవాఁడు, దృఢము మొదలైనవి గలవాఁడగును.

ప్రియయజ్ఞశిల్పవిద్య స్స్వబంధుసుహృదాం ప్రధానశాంతశ్చ,
సంవర్ధితార్థసునయో రత్నపరీక్షాసుకృతయత్నః. 23
ధర్మవ్యవహారరతో వినీతశీలో గుణై స్సమాయుక్తః,
మీనే భాస్కరతనయే పశ్చాద్భావా స్పదం పురుషః. 24

శని మీనమందుండఁగాఁ బుట్టినవాఁడు యజ్ఞాదులయం దాసక్తిగలవాఁడు, శిల్పవిద్య దెలిసినవాఁడు, బంధువులలో స్నేహితులలో శాంతుఁడు, రత్నపరీక్షయం దాసక్తి మొదలైనవి గలవాఁడగును.

## కుజక్షేత్రమందున్న శనిదృష్టిఫలము.

కర్షణనిరతమథాఢ్యం గోమహిషాజావిసంయుతం ధన్యం,
సూర్యేణ దృశ్యమానో జనయతి కర్కోద్యతం సౌరిః. 25
చపలం నీచప్రకృతిం నీచవిరూపాంగనానుసంసక్తం,
శని రిందుదృష్టమూర్తి స్సుఖధనరహితం నరం కురుతే. 26
ప్రాణివధపరం క్షుద్రం కురుతే చోరాధిపం సువిఖ్యాతం,
ప్రియయువతిమాంసపానం సౌరో వక్రేక్షితః కుజభే. 27
అనృతిక మధర్మపరం బహ్వాశం తస్కరం ప్రకాశంచ,
కాజే శనిర్జ్ఞ దృష్ట స్సుఖవిభవవినాకృతం పురుషమ్. 28

సుఖధనసౌభాగ్యయుతం నృపమంత్రిణ మగ్రగంచ సచివానాం,
గురుదృష్టో రవితనయః కుజగేహే మానవం కురుతే. 29

అతిచపల మతివిరూఢం పరాంగనాపణ్యాయువతిసంసక్తం,
కుజభవనే భృగుదృష్టో జనయతి రవిజో వివర్జితం భోగైః. 30
జననకాలమున కుజక్షేత్రములగు మేషవృశ్చికములందు శనియుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని ప్రాణిసధయం దాసక్తి మొదలైన ఫలములు గలవాఁడగును.

శుక్రక్షేత్రనుందున్న శనిదృష్టిఫలము.

స్ఫుటవాక్యం విగతధనం విద్వాంసం పరగృహేషు భోక్తారం,
రవిణాదృష్ట స్సౌరి స్సితభే పరిపేలవం పురుషమ్. 31
యువతిజనజనితసారం నృపమంత్రిపురస్కృతం యువతికాంతం,
శశినాదృష్ట స్సౌరిః కురుతే సితభే కుటుంబపరివారమ్. 32
సంగ్రామకథాభిజ్ఞం సంగ్రామపలాయినం సుబహువాక్యం,
భృగుభేకుజసందృష్టో జనధనపరివేష్టితం సౌరః. 33
నిత్యం విహాసనశీలం క్లీబతరం యువతి సేవకం నీచం,
బుధదృష్టో రవితనయ శ్శుక్రగృహే మానవంకురుతే. 34
పరవిషయదుఃఖసుఖనం పరకార్యకరం ప్రియంచ లోకస్య,
కురుతే గురుణాదృష్టో దాతారం సోద్యమం సౌరిః. 35
మద్యస్త్రీకృతసౌఖ్యం రత్నానాం భాజనం మహాసత్వం,
శుక్రగృహే సితదృష్టో జనయతి సౌరో నృపతిదయితమ్. 36
శని శుక్రక్షేత్రములగు వృషభతులలయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁఒడఁగాఁ బుట్టినవాఁడు ప్రస్ఫుటవాక్కులు మొదలైనవి గలవాఁడగును.

బుధక్షేత్రగుందున్న శనిదృష్టిఫలము.

సుఖరహిత మథాత్యంతం ధనరహితం ధార్మికం జితక్రోధం,
క్లేశసహిష్ణుం ధీరం బుధభే రవివీక్షిత స్సౌరిః. 37
నృపతుల్యం స్నిగ్ధతనుం నారీభ్యః ప్రాప్తవిభవసత్కారం,
స్త్రీణాం వా కృత్యకరం సౌర శ్చంద్రేక్షితో బుధభే. 38
విఖ్యాతమల్లమోహిత మతిభారవహం తథావికృతగాత్రం,
రుధిరాంగవీక్షితతను ర్జనయతి సౌరో నరం బుధభే. 39
ధనినం నియుద్ధకుశలం నృత్తాచార్యం చ గీతకుశలం చ,
శిల్పక మలీవ నిపుణం బుధభే బుధవీక్షిత సౌరః. 40

ప్రాత్యయికం రాజకులే సర్వగుణసమన్వితం సతామిష్టం,
గుణగుహ్యాధనంకురుతే గురుణాదృష్ట శ్శనైశ్చారీ. 41
స్త్రీమండలేషు కుశలం యోగాచార్య మథ యోగినం వాఽపి,
శుక్రేక్షితోఽర్కపుత్ర స్త్రీనణా మిష్టం నరంబుధభే. 42

శని బుధక్షేత్రములగు మిథునకన్యలయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని సుఖహీనుఁడు, నిర్ధనుఁడు, ధార్మికుఁడు, ధైర్యము మొదలైనవి గలవాఁడగును.

కర్కటకమందున్న శనిదృష్టిఫలము.

పిత్రారహితం బాల్యే దినపతిదృష్ట శ్శనైశ్చర శ్శశిభే,
ధనసుఖదారవిహీనం కదశనతుష్టం నరంపాపమ్. 43
జన్మనిమాతురనిష్టం ధనవంతం సహజపీడితంచైవ,
శశిదృష్ట శ్శశిభవనే దినకరపుత్రో నరం కురుతే. 44
నృపతిసమర్పితవిభవం వికలాంగం కనకరత్నపరివారం,
కుజదృష్ట శ్శశిభవనే కుబంధుపత్నీరతం సౌరిః. 45
నిష్ఠుర మతిప్రవాచం శమితారాతిం చ దాంభికం చాపి,
జనయ త్యుత్తమచేష్టం బుధదృష్టో భాస్కర శ్శశిభే. 46
క్షేత్రగృహాణాం సుహృదాం పుత్రాణాం భాగినం నరం కురుతే,
ధనరత్నదారవంతం శశిభే గురువీక్షిత స్సౌరిః. 47
ఆయతకులజాతానాం రూపవిలాసై స్సుఖై శ్చ రహితానాం,
కురుతే జన్మనరాణాం భృగుపుత్రః కర్కటే సౌరిః. 48

శని చంద్రక్షేత్రమగు కర్కటకమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని బాల్యమందు తండ్రిచే విడువఁబడినవాఁడు, ధనము సుఖము మొదలైనవి లేనివాఁ డగును.

సింహమందున్న శనిదృష్టిఫలము.

సుఖధనహీన మనార్యం ప్రియాన్వితం పానసక్తకుతనుంచ,
భృతకం దుఃఖిన మేకం సింహే సూర్యేక్షిత స్సౌరిః. 49
నానారత్నధనానాం యువతీనాం భాజనం విపులకీర్తిం,
శశిరగుదృష్ట స్సింహే సౌరో నృపవల్లభం పురుషమ్. 50
ప్రతిదిన మటన మథన్యం చోరం గిరిదుర్గవాసినం క్రూరం,

భార్యాపుత్రవిహీనం సింహే సౌరో రుధిరదృష్టః. 51
నైకృతిక మలన మధనం స్త్రీకర్మకరం మలీమసందీనం,
జనయతి బుధేనదృష్టో దినకరభవనాశ్రిత స్సౌరః. 52
గ్రామపురశ్రేణీనాం పురోగమాఢ్యం చ పుత్రవంతం చ,
గురుదృష్టః ప్రాత్యయికం సింహే సౌర స్సుశీలం చ. 53
యువతిద్వేష్యం కాంతం మంథరసుఖభాగినం ధనసమృద్ధం,
శుక్రేక్షితస్తు కురుతే భానుగృహే రవిసుత స్స్వంతమ్. 54

శని రవిక్షేత్రమగు సింహమందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని సుఖము ధనము మొదలైనవి లేనివాఁడు, మద్యపానముచేత రోగాక్రాంతమైన శరీరము మొదలైనవి గలవాఁడగును.

## గురుక్షేత్రమందున్న శనిదృష్టిఫలము.

పరపుత్రాణాం పితరం గురుభే సౌరేక్షిత శ్శుక్రః,
తేభ్యో ధనంచ లభతే నామఖ్యాతించ పూజాంచ. 55
మాతృరహితం సుశీలం నామద్వయసంయుతం రవే స్తనయః,
కురుతే శశినాదృష్టో భార్యాసుతవిత్తసంపన్నమ్. 56
వాతవ్యాధిగృహీతం లోకద్వేష్యం చ పాపశీలం చ,
క్షుద్రం నిందితశీలం గురుభే భౌమేక్షిత స్సౌరః. 57
జనయతి గురుభవనస్థో నృపతిసమం సౌఖ్యవంత మాచార్యం,
మాన్యం ధనినం సౌమ్యం సుభగం సౌమ్యేక్షిత స్సౌరః. 58
నృపతిం నృపతుల్యం వా మంత్రిణ మథ నాయకంచ సేనాయాః,
జనయతి గురుణాదృష్ట స్సర్వాపదవర్జితం సౌరః. 59
కురుతే ద్విమాతృపితృకం లిపినాద్రిషు జీవినం వివిధశీలం,
జనయతి సితేనదృష్టో రవితనయః కర్మసంపన్నమ్. 60

శని గురుక్షేత్రములగు ధనుర్మీనములయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని దత్తపుత్రుఁడు గలవాఁడు, తన్మూలముగ ద్రవ్యముగలవాఁడు, ఖ్యాతి మొదలైనవి గలవాఁడగును.

## స్వగృహే శనిదృష్టిః.

రోగిణ మరూపభార్యం పరాన్నభోగిన మతీవ దుఃఖసహం,
అటనరతం భారసహం సౌర స్సూర్యేక్షిత స్స్వగృహే. 61

చపల మసత్యం పాపం మాతురనిష్టం ప్రియానృతం సార్థ్యం,
ఉత్పన్నాటనదుఃఖం స్వగృహే చంద్రేక్షిత స్సౌరః. 62
అతిశూరం విక్రాంతం విఖ్యాతగుణం మహాజనపురోగం,
తీక్ష్ణం సాహసనిరతం స్వగృహే వక్రేక్షిత స్సౌరః. 63
భారసహం తామసికం శోభన మటనజ్ఞ మల్పవిత్తం చ,
ధన్యం జనయతి శనిభే బుధేన సంవీక్షిత స్సౌరః. 64
సముదితగుణం నరేంద్రం నృపవంశకరం చిరాయుష మరోగం,
త్రిదశగురుదృష్టమూర్తి ర్జనయతి సౌర స్స్వగృహసంస్థః. 65
ధనినం పరదారరతం సుభగం సుఖినం చ విత్తవంతం చ,
ఉత్పన్నపానభక్ష్యం స్వగృహే శుక్రేక్షిత స్సౌరః. 66

జననకాలమున శని, స్వక్షేత్రములగు మకరకుంభములయందుండి రవ్యాదిగ్రహములచే జూడఁబడెనేని రోగముగలవాఁడు, విరూపమైనభార్య, మొదలైనవి గలవాఁడగును.

ఇతి ఏకోనత్రింశోధ్యాయః.

---

## భావఫలములను దెలుపు ముప్పదవ యధ్యాయము.

మూర్త్యాదయః పదార్థా జాయంతే యేన సర్వజంతూనాం,
తస్మా దధునా వక్ష్యే భావాధ్యాయం విశేషేణ. 1

ఏహేతువుచేత సర్వజంతువులకు, శరీరము మొదలుగాఁగల అవయవములు పుట్టుచున్నవో అట్టిహేతువులు కలిగిన భావాధ్యాయమును జెప్పఁబోవుచున్నాను.

లగ్నేఽర్కేఽల్పకచః క్రియాలసమతిః క్రోధీ ప్రచండోన్నతో
మానీలోచనరూక్షకర్కశతను శ్శూరోఽక్షమో నిర్ఘృణః,
స్ఫోటాక్ష శ్శశిభే క్రియే సతిమిర స్సింహే నిశాంధః పుమాన్
దారిద్ర్యోపహతో వినష్టతనయో జాత స్తులాయాం నరః. 2

సూర్యుఁడు లగ్నమందుండఁగాఁ బుట్టినవాఁడు స్వల్పమైన జుట్టుగలవాఁడు, కార్యములయం దలసమతిగలవాఁడు, క్రోధము గలవాఁడు, గొప్పఉన్నతముగల వాఁడు, మాన్యుఁడు, కోపముచే ఎఱ్ఱనైన నేత్రములు గలవాఁడు, నిర్దయగలవాఁడగును. లగ్నము మేషము, లేక కర్కాటకమై అందు రవియుండెనేని మచ్చలుగల నేత్రములు గలవాఁడు, చీఁకటిగమ్మెడు నేత్రములు గలవాఁడు, సింహమైనచో రేజీఁ

